# వ్యాస సుధాలహరి - 2



రచన:

కె. వి. రాఘవాచార్యులు ఎమ్. కాం.



Sole - Distributors:
Karuna publications,
KODALI, Krishna Dt.

Sri PUBLISHING HOUSE
SWAMY AYYAPPA NAGAR, PATAMATA VIJAYAWADA-7.

# ముందుమాట

ఈ పుస్తకము అన్ని పాఠశాలల
విద్యార్థులకును, కళాశాలా విద్యార్థులకును
నుపయుక్తముగ నుండునట్లు వ్రాయబడినది.
పరీక్షలకెంతయు సహాయపడుననుట అతిశయోక్తికాదు.
చదివి విజయము పొందుడు.

ఇట్లు
—రచయిత.

# విషయ సూచిక

# చలన చిత్రములు

పవలంతయు కాయకష్టముచేసి యలసట చెందిన వ్యవసాయదారులకును నానా కార్మికులను నుద్యోగములు చేసి మనస్సు శ్రమచెంది యున్న యుద్యోగస్థులకును వినోదమును, వినోదముతో బాటు విజ్ఞానమును గలిగించుటకు పూర్వము వీధి నాటకములు, తోలుబొమ్మలాటలు ప్రదర్శింపబడు చుండెను. హరికథలును, బుఱ్ఱకథలు, జక్కులకథలు చెప్పబడుచుండెడివి. ఇవి యీ కాలములోను నంత యెక్కువగ లేకపోయినను నక్కడక్కడ సాగుచునేయున్నవి.

విజ్ఞానశాస్త్రమభివృద్ధి చెందిన పిదప ఛాయాగ్రహణము నందభివృద్ధికలుగుటచే జల చిత్ర అనంతరము శబ్దగ్రహణము సాధింపబడిన తరువాత మాట్లాడుచిత్రములు వెలువడినవి. క్రీ.శ. 1900 సం॥లో 'ఎడిసన్' అను శాస్త్రజ్ఞుడు చలనచిత్రములను దయారుచేయు యంత్రములను గనుగొనగా క్లేసన్సు అను నాతడు వీనిని వ్యాప్తిలోనికి దెచ్చెను. ఈ చలన చిత్రములు మానవునకు వినోద విజ్ఞానములను గలిగించుటలో ప్రముఖ

స్థానము సంపాదించినవి. ఇవి నేత్ర శ్రోత్రములకు రెండింటికిని విందు కలగించునవి.

నేడు ఖారీపరిశ్రమలును వానితోబాటు కుటీరపరిశ్రమలును నెట్లు ప్రోత్సహింపబడుచున్నవో యట్లే చలనచిత్రములతోబాటు హరికథాదులును ప్రోత్సహింపఁబడుచున్నవి.

చలనచిత్ర నిర్మాణము నేఁడొక పరిశ్రమయైనది. ఈ పరిశ్రమలో, కథారచయితలు, పాటలు, మాటలు వ్రాయువారు, నటీనటులు, వాద్యకళాకారులు మున్నగువారు పనిచేయుదురు. అందుచేత వారికి ధనము లభించును. కావున నీ పరిశ్రమయు నిరుద్యోగసమస నివారణకు తోడ్పడుచున్నది. ఇంతియేకాక చలనచిత్రముల ల ననేక లాభములు కలవు. కొలది ధనవ్యయముతో మానవుఁడు విజ్ఞానమును, వినోదమును బొందగలఁడు. ఇందుచే విరామకాలము సద్వినియోగమగును. ప్రపంచములో గల గొప్పపట్టణములను, సుందర దృశ్యములను స్వయముగ దర్శింపవీలుకలుగదు. అట్టివానిని చల చిత్రములలో జూచి యానందించవచ్చును. నటీనటుల నటనలను, గాయకుల గానములను, గళాకారుల ప్రతిభనుజూచుటకును, వినుటకునువకాశము కలుగును. ఆకాశవాణి, వార్తాపత్రిక మున్నగు ప్రచారసాధనములకంటె నివి యుత్తమమైనది. అందు స్వయముగ చూచుటకుగూడ వీలుగలదు గదా! విద్యావిషయిక ప్రచారమునకును నివి తోడ్పడుచున్నవి విద్యార్థులకు పుస్తకముల మూలమున దెలియజేయుటకంటె చిత్రములవలన నానావిషయములు బోధించుట చాలసులభము. విద్యార్థుల మనస్సులకు విషయ

ములు బాగుగనాటుకొనునుగదా! కళారహాస ములను విజ్ఞాన శాస్త్రవిషయములను బోధించుటకు నేడు చల చిత్రముల నుప యోగించుచున్నారు.

చలనచిత్రములవలన గలుగు ప్రయోజనములతోబాటు నష్టములును నెన్నియోకలవు. చలనచిత్ర నిర్మాతలు ధనసంపా దనమే దృష్టియందుంచుకొని మాత్రమే చిత్రములను దీయు చున్నారు. నేటి మానవుని మనస్సు కామమోహితమైనది. అట్టి ప్రేమపూరిత చిత్రములనుదీసి ప్రజలహృదయలగల కామమును రెచ్చగొట్టి మరింత నీతిహీనులుగ దయారుచేయుచున్నారు. సామాన్యప్రజల కిట్టి యసభ్యకరములును, నసహజములును నగు చిత్రములను అనాదరించుటకు వివేకములేకపోవుటచేతనే యిట్లు జరుగుచున్నది. కాబట్టి మంచినీతిని బోధించు చిత్రములనుదీయు టకు నిర్మాతలు పూనుకొనవలెను.

చలనచిత్రములందు నటింపవలెననుకోరికతో ప్రయత్నము చేసిచేసి విఫలురై నిరాశచెంది చెడిపోవువారును కలరు. చలన చిత్రములయందలి నాజూకుచే నాకర్షింపబడువారును, నీతిననుస రింపక అవినీతి ననుసరించి భ్రష్టులగువారును దయారగు చున్నారు. విద్యార్థులు పాఠశాలలకుబోకుండ మానుకొని చలన చిత్రమునందలి మోజుతో విద్యను నాశనముచేసికొనుచున్నారు. ఎక్కువగా చూచుటవలన ధనవ్యయమేకాక నిద్రాభంగమును నందువలన ననారోగ్యమును గలుగును. తీవ్రమైన కాంతిని జూచుటచే దృష్టి మందగించి కంటిజబ్బులు వచ్చును. చలన చిత్రములందుగల దొంగతన దృశ్యములనుజూచి యట్లే దొంగ

తనము చేయనలవాటుచేసి లేని దుర్గుణములకు లోనగుచున్నారు. చిత్రములందు ప్రదర్శింపబడు ప్రేమతత్వమును చూచి విద్యార్థులుగూడ నవినీతికి లోనగుచున్నారు. ఇది క్రమశిక్షణకు భంగరముకాదే?

ప్రభుత్వము చలనచిత్రములలోగల అవినీతికరములగు దృశ్యములను తొలగించి నీతికరములగు చిత్రములనే యనుమతించవలెను. ఇందులకు సెన్సారుబోర్డు కలదు. చలనచిత్రముల మంచి చెడ్డలను వార్తాపత్రికలు ప్రచారము చేయవలెను. నిర్మాతలుగూడ కేవలము ధనార్జనమే దృష్టియందుంచుకొనక నీతిని బోధించు చిత్రములను దీయవలయును. అటులైన చలనచిత్రములవలన కలుగు నష్టముల నరికట్టవచ్చును.

చలనచిత్రములు పౌరాణికములు, సాంఘికములు, జానపదములు అని మూఁడు విధములు. పౌరాణికములవలన పురాణ కథలును, నందలి మంచినీతిని ప్రజలు తెలిసికొందురు. సాంఘికములు, సంఘ దురాచారములను, మూఢనమ్మకములను బాలద్రోలునవిగ నుండవలెను. జానపదములు జనపదములకుజెందినవై యుండవలెను. ఈ మూఁడురకములుగాక ప్రచార చిత్రములును గలవు. మనదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన పిదప ప్రాచీన భారతీయ సంస్కృతిని, చారిత్రక వైభవములను ప్రచారము చేయుటకు మనప్రభుత్వము కృషిచేయుచున్నది.

చలనచిత్ర పరిశ్రమ ప్రజలకు మంచినీతిని బోధించునదిగను, జాతీయభావమును పెంపొందించునదిగను నభివృద్ధిపొందునుగాక.

# జనాభా సమస్య

సృష్టిలో ప్రతిజీవియు సంతానమునుబొందుట సహజము. జంతువులును, పక్షులును, వృక్షములును, గీటకములును స్త్రీ పురుష సంపర్కమువలన సంతానము బడయునుగదా! మనుజులలో నొకకుటుంబము కాలక్రమమున ననేక కుటుంబములగుచున్నవి. కాని పూర్వము భార్యాభర్తలు కేవలము సంసారసుఖమునే యాశించినవారుకారు. ఇంద్రియ నిగ్రహశక్తి వారికిఁగలదు. నేటిమానవుఁడు కేవలము కామపూరితుఁడై నియమదూరుఁడై యింద్రియలోలుఁడగుటచే సంసారసుఖమునే వాంఛించినవాఁడై యధికసంతానవంతుఁడగుచున్నాడు.

పూర్వము జనాభాసమస లేనేలేదు. పెలు- పుత్రపౌత్రాభివృద్ధిగస్తు- అని వధూవరులను దీవించెడివారు. ఆకాలమున నెక్కువ సంతానవంతులైనవారు సమ్మానార్హులు. అంతియకాక, ఆ కాలమున జనసంఖ్య యభివృద్ధియైనను మరణములసంఖ్యకూడ అధికమే. వ్యాధులు, కరువులు, వరదలు, యుద్ధములు మున్నగునవి మరణమునకు గారణములుగ నుండెడివి.

ఈ కాలమున బెరుగుచున్న జనాభా విపరీతముగ బెరుగుచునేయున్నది. మరణములసంఖ్య తగ్గుముఖముపట్టినది. విజ్ఞానశాస్త్రము దినదినాభివృద్ధి నొందుచున్నది. అనేక దివ్యములగు నౌషధములు కనిపెట్టఁబడుచున్నవి. సమస్తవ్యాధులును నిరో

ధింపఁబడుచున్నవి. చికిత్సకంటే ఆపుదలమేలు- అను నార్యోక్తి పాటింపఁబడుచున్నది. మృత్యువునే జయించుటకు మానవుఁడు సంసిద్ధుఁడై యున్నాడు. పూర్వము సంభవించిన కరువుకాటకములును, భూకంపములును, వరదలును, నగ్నిప్రమాదములును మున్నగు వైపరీత్యములను నేడదుపులోబెట్టుటకు జేయవలసిన ప్రయత్నములన్నియు జేయబడినవి. ఇంకను జేయబడుచున్నవి. శిశుమరణములసంఖ్యయుఁ దగ్గినది. మరణములసంఖ్య నదుపులో బెట్టినపుడు జననములసంఖ నుగూడ నదుపులోబెట్టనిచో దేశపరి తి విపత్కరముగ నుండుననుటలో సందియము లేదు. మ ణములసంఖ్య తగ్గుటయే జనాభా పెరుగుదలకుఁ గారణమైనది.

విపరీతముగ బెరుగుచున్న జనాభామూలమున నసేక చిక్కుసమస్య లుత్పన్నములగుచున్నవి. ప్రతిమానవునకు క స సౌకర ములు కావలయునుగదా! తినుటకుఁదిండి, కట్టుటకుబట్ట, ఉండుటకునిల్లు తప్పకయుండవలయును. ఒకప్పుడు రత్నగర్భ యని పేరొందిన భారతదేశము విదేశీయులపాలనలో జిక్కి బీద దేశమైనది. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు జనాభాసమస్య మహోపద్రవముగా దయారైనది. ప్రభుత్వమధికాహారోత్పత్తికి గృషిచేయుచున్నది. వృత్తులను పోషించుచున్నది, లఘు కుటీర భార భారీపరిశ్రమలను స్థాపించుచున్నది. ఎన్నియో నూతనోద్యోగములను గల్పించుచున్నది. ఎంత ప్రయత్నించినను సరియగు జీవనప్రమాణమును గల్పింపలేకపోవుచున్నది.

సంతాన మధికమగుటచే స్త్రీ పురుషులు నిర్వీర్యులగుదు రనుట అతిశయోక్తి కాదు. ఏటేటగాని, రెండేడ్లకొక పర్యాయముగాని ప్రసవించు గృహిణి బలహీనురాలయి యనారోగ్యముతో బాధపడును. అట్టి స్త్రీ కనిన సంతానమును నట్లేయుండును. భావిపౌరులు కావలసిన యాబిడ్డలు నిర్వీర్యులగుదురు గదా! పురుషులును గామోపభోగలోలురై యింద్రియ పటుత్వము లేనివారగుదురు.

కావున జనాభా వృద్ధికాకుండ నరికట్టుట యువతీ యువకులకును, ప్రభుత్వమునకును, దేశమునకును క్షేమమగును. పెరుగుచున్న జనాభాసమస్యను బరిష్కరించు కుటుంబనియంత్రణ మొక చక్కని మార్గము. అధిక సంతానోత్పత్తి నరికట్టుటకు కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సలు మంచిపద్ధతి. ఈ శస్త్ర చికిత్స పురుషులుగాని, స్త్రీలుగాని చేయించుకొనవచ్చును. పురుషులు చేయించుకొను నాపరేషను వేసెక్టమీయనియు, స్త్రీలు చేయించుగొను నాపరేషను ట్యూబెక్టమీయనియు నందురు. శస్త్రచికిత్సలేల అనువారు మనోనిగ్రహముతో కామమునకు దాసులుగాక అర్ధాంగి కేవలము కామవాంఛ తీర్చుకొనుటకేయనుబు విడనాడవలయును. మనోనిగ్రహశక్తి లేనివారికి కుటుంబనియంత్రణము పాటించుటకు శస్త్రచికిత్సయే శరణ్యము. సంతాననిరోధకమునకు నౌషధములును నితర సాధనములును గలవు. స్త్రీ పురుషులు వయస్సు వచ్చినతరువాత వివాహము చేసికొనవలయును. పరిమితకుటుంబమే సుఖమని

భావించవలయును. కుటుంబనియంత్రణ పద్ధతుల నవలంభించుట వలన నారోగ్యము చెడిపోదని వైద్యులు చెప్పుచున్నారు.

అధికసంతానమును గనిన గృహిణీ గృహస్థులు తమ బిడ్డలకు పౌష్టికాహారమును, వస్త్రములను, వైద్యసదుపాయము లను గల్పించలేక విద్యాబుద్ధులు చెప్పించలేకపోవుచున్నారనుట సర్వజనవిదితమే. కాబట్టి పరిమితకుటుంబము విలువను గుర్తించి ఇద్దఱు లేక ముగ్గురు బిడ్డలతో దృప్తిపడినచో నాకుటుంబము సుఖ పడును. దేశమునకు క్షేమమగును. అధికజనాభాసమస్య తీరును. అందుచేతనే దేశశ్రేయస్సుకొఱకు నధికజనాభా నరికట్టుటకు కుటుంబనియంత్రణమును ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. శస్త్రచికిత్స చేయించుకొనినవారికి ధనముకూడయిచ్చి యుచిత ముగ చికిత్సచేయించుకొనుటకు వసతికల్పించుచున్నది. ఆకాశ వాణిద్వారా ప్రచారము చేయుచున్నది. పరిమితకుటుంబము వలని లాభముల నెల్లఱకు దెలియజేయుచున్నది. ఉపన్యాసములు బుఱ్ఱకథలు ప్రదర్శనలు మున్నగువానిద్వారా ప్రచారముసాగు చున్నది.

కావున మూఢనమ్మకములను విడనాడి కుటుంబనియం త్రణమును ప్రజలు స్వచ్ఛందముగ నమలుపరచనచో బెరుగు చున్న జనాభా నరికట్టుట కష్టసాధ్యము.

# గ్రామ పునరుద్ధరణము

భారతదేశములో గ్రామము లధికములు. పూర్వము మన దేశములోని గ్రామములు భోగభాగ్యములతోడను బాడిపంటల తోడను దులతూగుచు స్వయం పోషకములై విలసిల్లుచుండెడివి. గ్రామస్థు లెవరెవృత్తులు వారు చేసికొనుచు స్వాతంత్ర్య జీవనులై యొప్పిరి. పశుపోషణమున బాడియును వ్యవసాయమున బంటలును గలిగి సుఖజీవితమును గడిపిరి. కూరగాయలును పండించిరి. పట్టణవాసులకు సరఫరా చేసిరి. ఇట్టి గ్రామములను బునరుద్ధరించుటేమి? ఉద్ధరించుట అనగా పైకెత్తుట అని యర్థము. గ్రామము లతి యంత హీనముగా నుండుటేమి? హీనస్థితికి వచ్చిననే గదా పునరుద్ధరించుట. అవును-నిజమే. మన భారతదేశ మాంగ్లేయుల పరిపాలనలో నున్నతఱి వారాంగ్లవిద్యను బ్రవేశ పెట్టిరి. విద నేర్చుకొనినవారి కుద్యోగములిచ్చిరి. యంత్రముల మీద వస్త్రాదులను దయారుచేసి మనదేశమునకు దెచ్చి యమ్మ సాగిరి. గ్రామస్థు లాంగ్లవిద్యాభ్యాసమున కెగబడి పట్టణములకు జేరిరి. విద్యాభ్యాసమునకు వలయు ధనముకొఱకు సామాన్యులు పొలముల నమ్మిరి. పరిశ్రమల ధాటికాగలేక వృత్తు లడుగంటి పోయినవి. ప్రకృతి వైపరీత్యములవలన కరువులు వచ్చుచుండుట వలనను, అతివృష్ట్యనావృష్టులు తటస్థించుటచేతను స్వయం

సమృద్ధములైన గ్రామములు దెబ్బతినినవి. ఇందువలన గ్రామములు పునరుద్ధరింపఁబడుట అత్యంతావశ్యకమైనది.

దేశౌన్నత్యము గ్రామములపై నాధారపడియుండును అనుట సత్యదూరము కానేరదు. దేశ దారిద్ర్యమును బాపుటకుగాని దేశవాసుల క్షుద్బాధను దీర్చుటకుగాని కర్షకోత్తముఁడే సమర్థుఁడనుట నిర్వివాదాంశము. దేశ శరీరమునకు గుండెకాయ వంటిది గ్రామము. గుండె శరీరము నందన్ని భాగములకు రక్తమును బంపునట్లు గ్రామము దేశములో సన్నిప్రాంతములకు నాహారపదార్థములను బంపును. కాన గ్రామము సస్యశ్యామలమై యుండవలయును. దేశప్రజలకు జీవనాధారమైన గ్రామము పునరుద్ధరింపఁబడిననేగాని దేశమైశ్వర్యవంతము కాజాలదు.

గ్రామములను బునరుద్ధరించుటెట్లు? ఆంగ్లేయులు మన దేశమును బాలించిరి కదా! ఆ కాలములో విద్యావిధానమునందుగాని సంప్రదాయములందుగాని యనేక మార్పులు వచ్చినవి. ఆంగ్ల నాగరికతా ప్రభావమునకు మనవారు లోంగిపోయిరి. ఈ వ్యామోహము గ్రామములందును హెచ్చు పెరిగినది. కావున మన భారతీయ సంప్రదాయములలో గాలక్రమమునన్నైన చెడుగులను విడనాడి నవీన విజ్ఞాన విషయములలో గల మంచిని గ్రహించి గుణాగుణము లెప్పుడును క్రొత్త పాతలపై నాధారపడియుండవని గుర్తెటిగి మన మభివృద్ధి పొందుటకును, గ్రామములను బునరుద్ధరించుటకును గృషిచేయవలసియున్నది.

మన దేశములోని గ్రామములు కొన్ని విషయములలో వెనుకబడి యున్నవి. వానినట్లే విడిచివేయక యుద్ధరించుట యెంతయు ముఖ్యము. విద్యా విషయములో గ్రామస్థులు వెనుకఁబడియున్నారు. 'విద్య లేనివాఁడు వింత పశువు' అని గదా యార్యుల సూక్తి. కాబట్టి పట్టణవాసులును ప్రభుత్వము వారును గ్రామవాసులను విద్యావంతులుగ జేయుటకు పాటు పడవలయును. శుచిత్వముయొక్క విలువ దెలియని వారికి దెలియ జేయవలయును.

వ్యవసాయదారులైన గ్రామస్థులకు నూతన పద్ధతులపై వ్యవసాయము చేయుటకు శిక్షణ నీయవలయును. ఇందులకు వారి కవసరమైనంతవఱకు ప్రభుత్వము ధనసహాయము చేయవలయును. విత్తనములను, ధనమును తక్కువ వడ్డిపై మదుపు పెట్టుటకు సహకార సంఘములు స్థాపింపఁబడవలయును. పశు పోషణ ముఖ్యమైన కార్యములలో నొకటి. కావున రైతులకు పశుపోషణకును, వానిజాతి నభివృద్ధి చేయుటకును సరియైన పద్ధతులను వారికి నేర్పవలయును. వ్యవసాయాభివృద్ధియైనచో గ్రామ పరిస్థితియును దేశపరిస్థితియును బాగుపడును. ప్రభుత్వ మిందులకు గృషిచేయుచునేయున్నది. అధిక దిగుబడి వంగడము లను, రసాయనికపు యెరువులను రైతులకు అందుబాటులోనుంచు చున్నది. ఆకాశవాణిద్వారా వ్యవసాయ పద్ధతులను దెలియ జేయుచున్నది.

పూర్వము గ్రామములో ప్రతియింటిలో నూలు వడికెడి వారు. చేతిపనులును గుటీరపరిశ్రమలును విరివిగ సాగుచుండెడివి. క్రమముగ యంత్రపరిశ్రమల ధాటికాగలేక వృత్తులు మూలబడినవి. కావున వృత్తి విద్యలు పునరుద్ధరింపఁబడవలెను.

పూర్వము గ్రామస్థులు ధర్మమార్గావలంబులు గాన వారిలో వారికి వివాదము లుండెడివికావు. నేటి నాగరికతా ప్రభావమున వారిలో నధర్మము పెరిగి వివాదములు చెలరేగుచున్నవి. వివాద పరిష్కారములకు న్యాయస్థానములకేఁగి కాల ధనములను దుర్వినియోగము చేసికొనుచున్నారు. వారున్యాయస్థానములలో వెచ్చించుధనము వ్యవసాయమునకు వినియోగించినచో రైతులు ఋణముల పాలుగాక సుఖముగ జీవింపఁగలరు. ఐకమత్యము నశించిన పరస్పర సహాయములేక కష్టముల పాలగుదురు. ఒకవేళ వివాదములు వచ్చినచో గ్రామపెద్దలకు నివేదించి పరిష్కరించుకొనవచ్చును. దీనివలన ధనవ్యయము కాదు, న్యాయము జరుగును.

గ్రామములు పునరుద్ధరింపఁబడకున్నచో దేశసౌభాగ్యము కుంటుపడును. కావున గ్రామస్థులు విద్యావంతులై శుచిత్వము యొక్క విలువను గ్రహించవలయును. పాశ్చాత్య నాగరికతా వ్యామోహ పిశాచమునకు లొంగక వృత్తులను మునుపటివలె కొనసాగింపవలయును. ఐకమత్యము పెంపొందించుకొని వివాదములు మానవలెను. పశుపోషణమున శ్రద్ధ వహింపవలెను.

పశువుల పేడ నెరువుగ నుపయోగించుకొనవలయును. తక్కువ వ ల కప్పులనిచ్చు సహకార సంఘముల సహాయమును బొంద వలయును. ప్రభుత్వము రైతులకును, నితరవృత్తుల వారికిని తగు విజ్ఞాన మందజేయుచు, ఋణముల నిచ్చుచు సహాయపడు చునే యున్నది.

కాబట్టి గ్రామములు పునరుద్ధరింపబడినచో దేశసౌభాగ్యము పెంపొందగలదని యెంచి యెల్లఱును గృషిచేయవలసి యున్నది.

## పంచవర్ష ప్రణాళికలు

శ్రేయో రాజ్యమును రూపొందించుట ప్రభుత్వము యొక్క విధి. అందులకు దేశములోని ప్రకృతి సంపదను సక్రమ పద్ధతులలో వినియోగించుకొనవలయును. మానవశక్తిని, పెట్టుబడులను గూడ క్రమబద్ధమగు పద్ధతులలో వినియోగించుకొనవలెను. ఇట్లు వినియోగించుకొనుటకు నిర్మాణాత్మకమైన కృషి అత్యావశ్యకము. అందుచేత నన్నిరంగములలోను చేయవలసిన కృషిని ప్రణాళికద్వారా రూపొందింపఁబడును. ఇట్లు ఐయిదు సంవత్సరములలోని కృషికై తయారు చేసికొనిన ప్రణాళికను పంచవర్ష ప్రణాళికయని యందురు. ఈ ప్రణాళికలు ని శ

కాలములో ననగా నైదేండ్లలో లక్ష్యములను గొంతవఱకుగాని, బూర్తిగాగాని సాధించునవిగనుండ వలయును. కాబట్టి యభివృద్ధి కార్యకలాపములను నిర్ణీత కాలములో నమలు పరచి ఫలితములనందు కొనుటకు దయారుచేసినవే ప్రణాళికలు.

వ్యవసాయము నభివృద్ధి చేయుటకు ప్రాజెక్టులు నిర్మించుట, కాలువలు త్రవ్వించుట, రవాణా సౌకర్యములు కలిగించుట. కర్మాగారములు నడుపుటకు విద్యుచ్ఛక్తి నుపయోగించుట, పరిశ్రమలను స్థాపించుట, నిరుద్యోగ సమస్యను బరిష్కరించుట మున్నగు నభివృద్ధి కార్యకలాపముల నమలు పరచి నిర్ణీతకాలములో ననగా నైదేండ్లలో ఫలితములను సాధించుట కేర్పాటు చేయబడిన ప్రణాళికలవలే పంచవర్ష ప్రణాళికలు.

నియంతృత్వ విధానముద్వారా ప్రణాళికలు రూపొందించుటయు, ప్రజాస్వామ్య ప్రభుత్వముద్వారా ప్రణాళికలు రూపొందించుటయునను రెండు విధానములద్వారా ప్రణాళికలు రూపొందించబడును. మన భారతదేశములో ప్రజాస్వామ్య ప్రభుత్వము కొనసాగుచున్నది. 1950 వ సంవత్సరము మార్చిలో భారత ప్రభుత్వము భారత జాతీయ ప్రణాళికా సంఘమును స్థాపించినది. 1967 వ సంవత్సరము సెప్టెంబరులో నది పునర్నిర్మింపబడినది.

ప్రణాళికల ప్రధాన లక్షణములను దెలిసికొందము. దేశమును వ్యావసాయికముగను, పారిశ్రామికముగను నార్థికము

గను నభివృద్ధిపరచి దేశమును స్వయంపోషకముగ దీర్చిదిద్దుట, ఉపాధి సౌకర్యములు కల్పించి నిరుద్యోగ సమస్యను నిర్మూలించుట, అవి యివి యనేల? అన్నివిధముల దేశప్రోభివృద్ధి జేయుటయే ప్రణాళికల లక్ష్యము. ప్రణాళికా నిర్మాణశాఖ, సమితుశాఖ, కార్యక్రమ సలహాదారులు, ఇంకను తదితర ముఖ్యులును గలసి పనిచేయుదురు. ప్రణాళికల లక్ష్యములు మహోన్నతములైనవి. మహోన్నతములగు లక్ష్యములను దృష్టిలో నుంచుకొని ప్రణాళికలు రూపొందించి, దేశసంపదను సరియైన విధముగ వినియోగించుటయే ప్రణాళికా సంఘము విధి.

రష్యా పంచవర్ష ప్రణాళికలు రూపొందించి శీఘ్రకాలములో నార్థికాభివృద్ధిని సాధించినది. అట్లే మన భారతదేశ ప్రజాస్వామ్య ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికలు రూపొందించి తద్వారా దేశాభివృద్ధిని సాధింపబూనినది. భారతదేశము విదేశ పరిపాలనలోజిక్కి యన్నివిధముల వెనుకబడినది. ఎంత ప్రకృతి సంపదయున్ననేమి? ఎంత ఖనిజసంపద యున్ననేమి? ఆ సంపదలను సద్వినియోగపరచుకొన వలయునుగదా! అందులకే స్వాతంత్ర్యము వచ్చిన పిదప ప్రణాళికలు రూపొందించబడినవి.

ప్రణాళికా లక్ష్యములను సాధించుటకు ప్రభుత్వముచేయుచున్న కృషి ప్రశంసనీయము. కమ్యూనిటీ ప్రాజెక్టులను ప్రభుత్వము చేపట్టినది. తుంగభద్ర, నందికొండ నాగార్జునసాగరు ప్రాజెక్టులు పూర్తి చేయుటకు విరివిగ యత్నములు జరుగు

చున్నవి. కర్మాగారములు, ముఖ్యపరిశ్రమలు, విద్యాలయములు విరివిగ స్థాపింపఁబడుచున్నవి.

మన ప్రజాస్వామ్య ప్రభుత్వము 1952 వ సంవత్సరములో ప్రథమ పంచవర్ష ప్రణాళికను మొదలుపెట్టినది. మన దేశము ప్రధానముగ వ్యావసాయిక దేశమగుటచే నధికాహారోత్పత్తిని సాధించుటకు వ్యవసాయమునకు ప్రాధాన్యమీయఁబడినది. 2356 కోట్ల రూప్యములు పెట్టుబడి పెట్టబడినవి. అధికాహారోత్పత్తితోపాటు కొన్ని సంస్థలుగూడ నెలకొల్పబడి యాంత్రిక సాంఘికాభివృద్ధి గావింపఁబడినది. సాంఘిక సంక్షేమ పథకములు అమలు పరచబడినవి. వెనుకబడిన జాతుల యభివృద్ధికి తోడ్పడినది. దేశమనేక విధముల యభివృద్ధి చెందినది. మొత్తముమీఁద నీ ప్రథమ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమమునకు బునాదులు వేసినదని చెప్పవచ్చును.

1956 వ సంవత్సరము ఏప్రియల్ నెలలో రెండవ పంచవర్ష ప్రణాళిక యమలులోనికి వచ్చినది. ఇది మఱింత అధికాహారోత్పత్తిని, నితర యుత్పత్తులను సాధించుటకు రూపొందించఁబడినది. జాతీయదాయమును పెంపొందించుట, భారిపరిశ్రమలు, యంత్ర కర్మాగారములు స్థాపించి పారిశ్రామికాభివృద్ధి గావించుట, నిరుద్యోగ సమస్యను బరిష్కరించుట, ఆర్థిక అసమానత్వమును తగ్గించుట ఈ ప్రణాళికా లక్ష్యములు. ఈ లక్ష్యము లీ కాలములో చాలవఱకు నెరవేఱిన వనవచ్చును.

మూడవపంచవర్ష ప్రణాళికా కాలములో నన్నిరంగము లలో స్వయంసమృద్ధిని సాధింపబూనుట ముదావహం. చైనా పాకిస్తాను యుద్ధములభివృద్ధిసాధనకు నాటంకములైనవి. ఆహార పదార్థములకొరత యేర్పడినది. ఉద్యోగావకాశములు కల్పించు టకు లులేకపోయినది. ధరలు విపరీతముగ బెరిగినవి.

పిదప వార్షిక ప్రణాళింలు కొంతకాల మమలులోనికి వచ్చినవి. నాలుగవ, ఐదవ పంచవర్ష ప్రణాళికల లక్ష్యములు సాధించుటకు ప్రభుత్వము విశేషధనము ఖర్చుపెట్టినది. ఆరవ పంచవర్ష ప్రణాళిక అమలులోనికివచ్చినంత దేశము సర్వతో ముఖాభివృద్ధి నందగలదు.

పంచవర్ష ప్రణాళికలు సక్రమముగనమలుజరిగినచో దేశము స్వయింసమృద్ధిని సాధింపగలదనుటలో సందియములేదు.

# విద్యార్థులు - రాజకీయములు

విజ్ఞానమును బ్రసాదించు విద్యను నేర్చుకొనువాఁడు విద్యార్థి. విద్యార్థి యొకేవిషయమునందు పెద్దకాలము మన సుంచలెడు. అవధానశక్తి తక్కువ. అందుచేత నేకాబోలు పాఠ శాలలో వివిధపాఠ్యాంశములు కాలనిర్ణయపట్టిక ననుసరించి బోధింపఁబడుచుండును. అతని వివేకము పరిపక్వస్థితిలోనుండక

యెట్లు త్రిప్పిన నట్లు తిరుగును. అతఁడు భక్తిశ్రద్ధలతో విద్యాభ్యాసము చేయవలసినవాఁడు. కావున క్రమశిక్షణతో మెలగవలసి యుండును. చిన్నతనమున నేర్చినవిద్యాబుద్ధియందు తెన్నుగాం బట్టుపడును. విద్యయే కాదు. ఏ యలవాటయినను నంతియే. ఇక రాజకీయములు పరిపాలనా సంబంధములు. రాజకీయపార్టీలు, ఎన్నికల్లో మెజారిటీ సంపాదించినపార్టీ పరిపాలన చేయుటయు, మైనారిటీపార్టీలు ప్రతిపక్షముగనుండుటయు జరుగును. పరిపాలనా వ్యవహారాలు గొప్ప గొప్ప రాజకీయవేత్తలకే యర్థం కావు. అట్టియెడ చదువుకొను విద్యార్థి రాజకీయముల్లో పాల్గొనవచ్చునా? అనునదొక సమస్య.

విద్యాభ్యాసకాలమున విద్యార్థి రాజకీయ వ్యవహారములలో బాల్గొనిన విద్యకు భంగము గలుగుట తప్పదు. రాజకీయ పార్టీల ప్రభావమున విద్యార్థులలోకూడ పార్టీలేర్పడి యైకమత్యము నశించి కొట్లాటలకుగూడ దిగుట మనముచూచుచునేయున్నాము. విద్యార్థి నాయకులు తాము రాజకీయములలో జోక్యముకలిగించుకొని చెడిపోవుటయేకాక తోడి విద్యార్థులనుగూడ రాజకీయములలోదించి వారినిగూడ చెడగొట్టినవారగుచున్నారు. రాజకీయపార్టీలు తమపార్టీ ప్రయోజనములను సాధించుకొనుటకు విద్యార్థులను వాడుకొనుచున్నారు. ఎన్నికలసందర్భములలో పార్టీప్రచారము నిమిత్తము విద్యార్థులకుత్సాహము కలిగించి వారిని వాడుకొనుచున్నారు. కాని విద్యార్థి రాజకీయపార్టీల ప్రాబల్యమునకు లొంగక విద్య

నేర్చుకొనుటయే తమకర్తవ్యముగ భావించవలసియున్నది. రాజకీయవ్యవహారములు అవగాహనముచేసికొనుశక్తి విద్యార్థులకులేదు. అందుచే రాజకీయములలో విద్యార్థులు జోక్యము కల్గించుకొని విద్యాభ్యాసమును పాడుచేసికొనరాదు.

నేటివిద్యార్థియే రేపటిపౌరుఁడు. విద్య ముగించినపిదప నతఁడు మంత్రికావచ్చును. ముఖ్య మంత్రి, ప్రధానమంత్రి, అధ్యక్షుఁడు కావచ్చును. అప్పుడు తన పదవినితాను నిర్వహించుటకు తగిన రాజకీయ విజ్ఞానము విద్యార్థి దశలోనే నేర్వవలయును. సంపూర్ణజ్ఞానమునుబొంది రాజ్యాంగతంత్రములు, చట్టనిర్మాణము, శాసనసభాచర్చలు అవగాహనముచేసికొని దేశపురోభివృద్ధికి దోడ్పడవచ్చును. అవియర్థముకానిచో నున్నతపదవులను నిర్వహించుట కష్టము. అట్టిబుద్ధివికాసము విద్యార్థిదశలోనే కలుగును. కాబట్టి విద్యాభ్యాసకాలములో రాజకీయములలో బాల్గొని విద్యకు భంగముకలిగించుకొనుట సమంజసముకాదు. భావిపౌరుఁడుగా రాణింపవలసిన విద్యార్థి, దేశశ్రేయస్సునుగోరి దేశసౌభాగ్యమునకు గారకుఁడైన విద్యార్థి రాజకీయములలో దిగి చదువుకొనుకాలమును దుర్వినియోగముచేసికొనుటతగదు. విద్యార్థిదశలో విద్యార్థి వార్తాపత్రికలను జదువుకొనుచు, గొప్పవారి యుపన్యాసములువినుచు, పరిపాలనా వ్యవహారములు దెలిసికొనుచు, గ్రంథములు చదువుకొనుచు రాజకీయముల నవగాహనముచేసికొనవలయునేకాని రాజకీయములలో బాల్గొనరాదు.

వేరు పాఠశాలలలో విద్యార్థులకు రాజకీయపరిజ్ఞానము

గలిగించుటకు ఎన్నికలు, పార్లమెంటు మంత్రుల సమావేశ ములు మున్నగునంశముల నేర్పాటుచేసిరి. విద్యా నాయకుల యెన్నికలలోగాని యితర పాఠశాలయొక్క యెన్నికలలోగాని పట్టుదలబోకయిదంతయు మనము నేర్చుకొనుటకేయని విద్యార్థులు భావించవలయును. విద్యకుభంగకరముగ ప్రవర్తించరాదు. పాఠశాల యెన్నికలలోగూడ రాజకీయపార్టీల ప్రాబల్యము కనబడుచున్నది. దానితో కక్షలుచెలరేగి కొట్లాటలు చెలరేగు చున్నవి.

మనభారతదేశ స్వాతంత్ర్య సంపాదనము సహాయనిరా కరణోద్యమము చెలరేగినది. అప్పుడు విద్యార్థులు రాజకీయ ములలో బాల్గొని స్వాతంత్ర్యసమరము చేసినవారునుగలరుగదా! విద్యాభ్యాసకాలమప్పుడు దుర్వినియోగముకాలేదా? విద్యా ర్థులు చెడిపోయిరా? నిజమే విద్యార్థులప్పుడు రాజకీయములం లదుూర్చిరి. అప్పటిపరి తివేను. దేశము విదేశపరిపాలనలో జిక్కి నది. ఆంగ్లేయుల ఆటకట్టించుటకు విద్యార్థులుగూడ కంకణము కట్టుకొనిరి. స్వాతంత్ర్యమును సంపాదించిరి. నేటిప్రజాస్వామ్య ప్రభుత్వ రాజకీయములలో విద్యార్థులు తలదూర్చనవసరమేమి కలదు? నాయకులు తప్పుదారిబట్టినవారిని ప్రబోధించి సరియైన దారికి ద్రిప్పవచ్చును గాని విద్యార్థి రాజకీయములలో పాల్గొని భావిజీవితమును పాడుచేసికొనరాదు.

రాజకీయపార్టీలు ఒక పార్టీనుండి మరియొకపార్టీలో చేరుచు స్వలాభపక్షపాయణులైనవారిచే నేర్పడినవేగాని దేశ

శ్రేయస్సును దృష్టిలోనుంచుకొని పనిచేయునవి కావు. అని విద్యార్థులు గుర్తించి రాజకీయపార్టీల ప్రభావమునకులోంగి రాజ యములలో బాలొని తమవిద్యను బాడుచేసికొనరాదు.



# అంటరానితనము

అంటరానితనమనినను, నస్పృశ్యతయనినను నొకటే యగును. అంటరానితన మారోగ్యమునకు సంబంధించినది యును సంఘ దురాచారములకు సంబంధించునదియును నని రెండువిధములు. అంటురోగములుగలవారినిగాని, వారు ధరించు దుస్తులనుగాని, వారిభోజనపాత్రలనుగాని మున్నగు వానిని నారోగ్యవంతులు తాకరాదుగదా! ఆ వ్యక్తికాదోషము పోయిన ననఁగా రోగముపోయినచోనతఁడు తాకదగినవాడగును సాంఘికాచారములవలనకలుగు నస్పృశ్యతయొకటి కలదు. సాధారణముగ జనించినప్పుడు పురుడనియు, మరణించినపుడు సూతకమనియు నంట్లుపాటించుట అనాదినుండియుగలదు. శౌచకర్మానంతమా యంటుదోషము తొలగిపోవును. ఈ యాచారము మనదేశములోనేకాక విదేశములలో గూడ గలదు.

సంఘదురాచారములవలన నేర్పడిన అంటరానితనము పిశాచమువలే సంఘమునుబట్టి పీడించుచున్నది. మనుస్మృతి రచనాకాలమున మనసంఘములో నంటరానితనము ప్రారంభమైనదని పె లందురు. ఆదిమజాతులలో నస్పృశ్యతలేదు.

ఆదిమజాతులవారు విదేశీయులచే నోడింపఁబడిరి. వారిచ్చునన్న వస్త్రములతో జీవించుచు నూరివెలుపల నివసించుచు వచ్చిరి. వారవలంభించిన వృత్తులు హీనవృత్తులై యుండవచ్చును. ఆర్యుల చేతను ద్రావిడులుచేతను జయింపఁబడిన యీ విమవాసులు చర్మకారవృత్తి నవలంభించుటచే వారస్పృశ్యులైరని కొందరి యభిప్రాయము. మరికొందరీ యభిప్రాయమును ఖండించిరి. బౌద్ధహిందూమతముల సంఘర్షణనుండి అస్పృశ్యతవచ్చియుండునని మరికొందరూహించిరి. రానురానీయంటరాని తనము ప్రబలుచు వచ్చినది.

అంటరాని వారి నూరి వెలుపలనుంచిరి. వారి నెవరును తాకరాదు. వారు సవర్ణులతో గలసిమెలసి యుండరాదు. కఠినమైన యాంక్షలును నియమములును విధింపఁబడినవి. గ్రామములో బావులలోని నీరు తాకరాదు. మరణశిక్ష విధింపబడిన దోషులను వారే చంపవలయును. ఇక నిషేధములా చెప్పుటకు వీలులేదు. పంచములనబడువారి స్థితి శోచనీయముగ నుండెను.

లోకములో మానవులందరును సమానులే. ఈకులభేదము లేమి? ఈ యస్పృశ్యతయేమి? కులభేదములు వృత్తులనుబట్టి యేర్పడినవే. అస్పృశ్యత యెట్లేర్పడినదో తెలిసికొంటిమి. కర్మభూమియైన భారతభూమిలో నస్పృశ్యత యేమి? ఇది దేశమునకే కళంకముకదా! అందుచేతనే అస్పృశ్యతనురూపుమాటకు ప్రవక్తలును, సంఘసంస్కర్తలును, నాయకులునుచాలకాలంనుండియు ప్రయత్నములుచేయుచునేయున్నారు. గౌతమబుద్ధుఁడు, వర్ణ

వ వ అర్థరహితమైనదనియు జాతి జ్ఞానమునుబట్టిగాని, జన్మచే గాని, నిర్ణయింపదగినదికాదనెను. అద్వైతమతమును బోధించిన శంకరాచార్యులు జగమును నభేదభావముతోజూడగలిగినవాడు చండాలుడైనను నాకు గురువని యొకచండాలు నాదరించెను. విశిష్టాద్వైతమతమును బోధించిన రామానుజాచార్యులు సర్వమానవులును సమానులేయని బోధించెను. చెప్పుటకేమి? ఎన్నియైనను చెప్పవచ్చును. తొలుత తానాచరించి యాదర్శపురుషుడు కావలయును. రామానుజుడు పంచముల నాదరించెను. ఆళ్వారులలో పంచములుగూడ కలరు. అతడు పంచములను దేవాలయములలోనికి గొనిపోయెను. వైష్ణవాచార్యుడగు రామానందుడును వీరశైవుడగు బసవేశ్వరుడును వర్ణవిభేదములు కూడదనిరి. శైవుల్లో మహాభక్తులై పేరుపొందిన పంచములెందరో కలరు.

స్వామి వివేకానందుడు అంటరానితనమును బూర్తిగ నిర్మూలింపవలయునని సవర్ణులకు బోధించెను. అస్పృశ్యతను రూపుటకు కృతనిశ్చయుడై గాంధీమహాత్ముడు చేసినకృషి వర్ణనాతీతము. భారతదేశములో పంచములు చాల హీనముగ జూడబడుచుండెడివారు. ఆంగ్లేయులు పరిపాలకులైన తరువాత క్రైస్తవ మతప్రచారము చేసి, ఆ మతమును బోధించిరి. ఆమతమును స్వీకరించిన పంచముల కాహార విద్యా వైద్యాదిసౌకర్యములు గలిగించిరి. అందుచేత పంచములు చాలమంది క్రైస్తవులైరి. గాంధీజీ యీ స్థితులనవగాహన చేసికొని పంచములను

రింపబబు కంకణుఁడై వారికి హరిజనులని పేరుపెట్టి అస్పృశ్యత నివారింప నిరంతరము పాటుపడెను. హరిజన్-అను పత్రికనునడిపి తద్వారా ఆ సమస్యను బరిష్కరించుటకెంతయు పాటుపడెను. హరిజనులకు దేవాలయ ప్రవేశము కల్పించెను. డాక్టర్ అంబేత్కర్ దళితప్రజల హక్కులకై సవర్ణులతో పోరాటము సలిపెను. జీవితకాలమంతయు నతఁడు అస్పృశ్యతను నిర్మూలించుటకు కృషిచేసెను. "మంచియన్నది మాలయైతే మాల నేయగుదుఁ" అని మహాకవి గురజాడ అప్పారావుగారు పలికిరి. అస్పృశ్యతను నిర్మూలించుటకు నింకను నెందఱో కృషిచేసిరి.

ప్రభుత్వము హరిజనోద్ధారణమునకు కృషిచేయుచునే యున్నది. అనేక శాసనాలుచేసి యస్పృశ్యతను నిషేధించినది. వారికెక్కువ సౌకర్యములు కల్పించుచున్నది. అస్పృశ్యతను పాటించువారు శిక్షార్హులు. ఎన్ని ప్రయత్నములు జరిగినను సవర్ణులు చిత్తశుద్ధితో గృషిచేయనిచో నిదిపూర్తిగ నిర్మూలింపఁబడదు. కాబట్టి హరిజనోద్ధరణ కింకను గృషిచేయవలసి యున్నది.

# కుటీర పరిశ్రమలు

సృష్టిలో భగవంతుడు ప్రసాదించిన ముడిపదార్థములు నిత్యజీవితములో నుపయోగపడునట్లు చేసికొనవలసియున్నది. ఇట్లు చేయుటయే పరిశ్రమ యని చెప్పుదురు. కుటీరములలో జేయు పరిశ్రమలను గుటీరపరిశ్రమలనియు యంత్రసహాయమున చేయు పరిశ్రమలను యంత్రపరిశ్రమలనియు నందురు.

పూర్వము మనభారతదేశము కుటీరపరిశ్రమలకు పేరు పొందినది. చేతనేత, అల్లికము, మున్నగు పరిశ్రమలు, తివాచీనేత, పట్టువస్త్రములు మున్నగు వానిని తయారుచేసిరి. మనోహరములైన బొమ్మలు, నగలు, వివిధములగు పాత్రలు మనవారు తయారుచేసిరి. ఇవి యన్నియును తూర్పుదేశ వాసులనేగాక పడమటి దేశవాసులనుగూడ నాకర్షించినవి. మానవుడానాడు జీవితావసరవస్తువులన్నియును జేతులతో తయారుచేసికొనెడివాడే. అనగా కుటీరపరిశ్రమలే యప్పటివారి కాధారం. వారి హస్తకళానైపుణ్యము మెచ్చదగినది.

కుటీరపరిశ్రమలకు పెట్టుబడియంతగ నవసరముండదు. కుటుంబసభ్యులే పరస్పర సహాయంతో వస్తువులను తయారుచేయుదురు. వడ్రంగము, కమ్మరము, త్రాళ్ళుపేనుట, బుట్టలు, చాపలు అల్లుట మున్నగు వృత్తిపనులన్నియును గుటీరపరిశ్రమలే యగును. ఆ యా గ్రామములలో లభ్యమగు ముడిసరకును బట్టి యచ్చటి పరిశ్రమలుండును.

ఆనాటి గ్రామములు సర్వతోముఖాభివృద్ధి నొందివర్ధిల్లినవి. ఆంగ్లేయులు మనదేశమునకు బాలక్షులైరి. వారు మొదట వర్తకము చేసికొనుటకు మనదేశమునకు వచ్చిరి. దేశమును వశపరచుకొని వారు దేశీయవృత్తులను పాడుచేసిరి. వారిదేశంలో యంత్రాల మీఁద స్వల్పవ్యయముతో తయారైన వస్తువులను నిచ్చట విక్రయింపసాగిరి. ఆ పోటీకి దట్టుకొనలేక వృత్తులు మూలబడినవి.

స్వతంత్ర్యము వచ్చిన తరువాత భారతదేశము కుటీర పరిశ్రమల ప్రాముఖ్యతను గుర్తించినది. యంత్రయుగమైన యీ కాలములో భారీ పరిశ్రమలును నవసరములే. గ్రామములధికంగా గల మనదేశంలో గ్రామాభివృద్ధిని సాధించుటకు కుటీరపరిశ్రమలత్యంతావశ్యకములు. అందుచేనే ప్రభుత్వము కుటీరపరిశ్రమాభివృద్ధికి నెంతయు ప్రోత్సాహమిచ్చుచున్నది. భారీపరిశ్రమాభివృద్ధి యైనవి. ఇంకను నగుచున్నవి. కుటీరపరిశ్రమలయందు పనిచేయుచున్న గ్రామస్థులు దాదాపు మూడుకోట్లకుపైగా నున్నారు. వారిలో నేబదిలక్షులమందికి పైగా చేనేతమీద నాధారపడిన వారు.

లఘుకుటీర పరిశ్రమలకు జాతీయముచేయబడిన బ్యాంకులు ధనసహాయం చేయుచున్నవి. అఖిలభారత చేతిపరిశ్రమల సభయొకటి స్థాపింపబడినది. ఆ సభ మనదేశమందుత్పత్తి ఎక్కువగ జరుగుటకును నితరదేశాలందుగూడ విక్రయ మగునట్లును జూచును. పారిశ్రామిక సహకార సంస్థలును స్థాపింపబడినవి.

ఉపాధిని కల్పించుటలో వ్యవసాయము తరువాత చేనేత పరిశ్రమయే ముఖ్యమైనది. నేతగాండ్రుపయోగించు చేతి మ

ములుగాక పవర్ మగ్గాలుకూడా వాడుకలోనికి వచ్చినవి. చేనేత వస్త్రాలపై విదేశీయులకు మోజు అధికమయినది. అందు చేత వస్త్రముల యెగుమతియు నధికమగుచున్నది. చేనేత పరిశ్రమ ప్రాముఖ్యతను గుర్తించి ప్రభుత్వము పనివారికి మగ్గములును, నూలును సహాయము చేయుచున్నది. ప్రణాళికలలో గ్రామీణ పరిశ్రమాభివృద్ధికి కోట్లకొలది ధనము కేటాయించుచున్నది. గ్రామీణ వాతావరణములందు పరిశ్రమ కేంద్రము స్థాపించుటకు గావలసిన సాంకేతిక విజ్ఞానమునకు గ్రామీణ పరిశ్రమల ప్రణాళికా పథక మొకటి కేంద్రప్రభుత్వ సహాయముచే బరిగ్రహింపబడినది.

ఆంధ్రప్రదేశ్ లో కొండపల్లి, తిరుపతి రకరకాల బొమ్మలకును నాటవస్తువులకును బ్రసిద్ధిచెందినవి. వరంగల్లు, ఏలూరు తివాచీలకు పేరుపొందినవి. అద్దకమున కాంధ్రప్రదేశమంతయు పేరుగాంచినది. పట్టు పరిశ్రమకు మైసూరు, అస్సాం, జమ్మూ-కాశ్మీరు మున్నగు రాష్ట్రములు ప్రఖ్యాతిగాంచినవి.

గ్రామీణ లఘుపరిశ్రమలు భారతదేశపు ఆర్థికాభివృద్ధిని దీర్చిదిద్ద గలవు. గ్రామములలోని పాక్షిక నిరుద్యోగులగు వ్యవసాయదారులకును వృత్తివిద్యావంతులగు గ్రామీణులకును వృత్త్యుపాధిని గలిగించును. అందుచేత నిరుద్యోగ సమస్య పరిష్కారమున కివి యెంతయు దోడ్పడును. వృత్తిపనులు వారి కళాకౌశలము నభివృద్ధియగును. గ్రామములు స్వయంపోషకములై వర్ధిల్లుచు దేశసౌభాగ్యమునకు గారణములగును. రైతుల ఆర్థికపరిస్థితి మెరుగై జీవప్రమాణ మధికమగును.

కుటీర పరిశ్రమలవలన తక్కువకాలములో నెక్కువ వస్తువుల నుత్పత్తిచేయుట సాధ్యపడదు. పరిశ్రమలు ప్రభుత్వయాజమాన మున స్థాపింపఁబడి నడుపబడుట పెట్టుబడికిని నమ్మకమునకు నెక్కువ సౌకర్యముగనుండి త్వరలో నభివృద్ధి చెందును. అంతియ కాక ప్రభుత్వము పారిశ్రామిక వస్తుప్రదర్శనముల నేర్పాటుచేసి వృత్తులవారికి నుత్సాహముకలిగింపవలెను. అన్నిటికంటె ముఖ్యముగ వృత్తివిద కెక్కువ ప్రాధాన్యమిచ్చినసాంకేతిక నిపుణులను దయారుచేసి చో నింకను గుటీరపరిశ్రమలు పెంపొందగలవు.

# ఆధునిక సాహిత్యము

సాహిత్యము, సారసత్వము, వాఙ్మయము అను మూడు పదములును నిప్పుడు కొంచె మించుమగ సమానార్థకములుగవాడుచున్నవి. ఇవి యర్థవిస్తృతిలో నొక కేంద్రవృత్తముల వంటివి. రసప్రధానములును నానందప్రదములును నగు కావ్యములు సాహిత్య మనదగును. శాస్త్రములును నితర గ్రంథములును సారస్వతమున జెల్లును. నాక్రూపమైన సర్వమును వాఙ్మయమగును. ఆధునిక సాహిత్య మనఁగా నీకాలపు సాహిత్యమని చెప్పనగును,

కవితలేనిదే సాహిత్యములేదు. సారస్వతములేదు. వాఙ్మయములేదు. సాధారణముగా గవి దేశకాలవ్యవలకులోనై సాంఘికవ్యవలను జాతి మతవికాసములను బయలుపఱచుచునే యుండును. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కవికావశ్యములు ప్రతిభదైవదత్తము. బహుజ్ఞయు నుచితానుచిత వివేకమును వ్యుత్పత్తియనఁబడును. కావ్యపఠనమువలన గలుగునదభ్యాసము ప్రతిభావ్యుత్పత్తులుగల కవియేమహాకవి. క్రౌంచపక్షి యాక్రోశి చునపుడు వాల్మీకినోటనుండి అప్రయత్నముగ నకాంక్షిత ముగ లయాన్వితమైన వాక్యము వెలువడినది. అదిశ్లోకమైనది. చందము పద్యమునకు విశేషము. గానలయాసమ్మేళనమువలన గలుగు శ్రుతిమనోహరత్వము భావప్రకటనశక్తియు చందము నందుగలదు. ఛందస్సు మానవనిర్మితమగు కృత్రిమశాస్త్రము గాదు. సర్వాంగసుందరమును ఛందోబద్ధమునునగు కావ్యము గద్యముకంటె నెక్కుడు సుఖదాయకము.

హైందవవిజ్ఞానములకంతకును మూలాధారము సంస్కృత భాషా వాఙ్మయము. పురాణకావ్య ఇతిహాసాదులు అనువదింప బడినవి. అనువదించుటయేకాక స్వతంత్ర కల్పనాశక్తికి, వర్ణనా చాతుర్యమునకును ప్రాధాన్యమిచ్చు తలంపుతో కవులు ప్రబంధ ములను వ్రాసిరి. పూర్వకవితయంతయు రాజుల పోషణము వలన వృద్ధిచెందినదే.

పూర్వకవిత్వమున నసంతృప్తిచెంది నవ్యకవిత్వము వ్రాయవలయుననుకోరిక ఈనాటికవులకు కలిగినది. మనపూర్వు

లకును వారికంటె పూర్వుల కవిత్వముపై కొంత అసంతృప్తి కలిగి నవ కవిత్వము వ్రాయవలయునని ప్రయత్నించిరి. శ్రీనాథుడు తనకవిత్వమును నవ్యమని చెప్పుకొనెను. ఈకాలపు కవులు పూర్వకవిత్వమన్నంతనే అసహ్యపడుట నాగరికాచార ముగ నెంచుచున్నారు.

నేడు ఆంగ్లవాఙ్మయము మనదేశమున బాగుగా వ్యాపించి మిగులనెన్నికగన్నది. ఆంగ్లవాఙ్మయ సంసరమువలన గవిత యందలి పూర్వపురుచి మారినది. దేశభాషావాఙ్మయములన్ని టిలోవలె ఆంధ్రవాఙ్మయమునను నూతనశాఖలు బయలుదేరినవి. సంస్కృతసాహిత్యాశ్రయమును వదలి ఆంధ్రదేశస్థితిని జాతిత్వ మును వెల్లడింపగల సాహిత్యము బయలుదేరినది. నవలలు, నాటకములు, విమర్శనము, ఖండకావ్యములు, గేయములు మొదలగు ననేకసాహిత్యశాఖలు బయలుదేరినవి. పురాణకథ లకుబదులు ఆత్మానుభవనివేదనే కథావస్తువుకాజొచ్చినది. భావ గీతములు, ఊహాగానములు కథలు, కథానికలు, ప్రహసనములు ఎన్నియో సాహిత్య శాఖోపశాఖలు.

సాహిత్యమున నవ్యత వెలసినది. నేడువెలసిన సాహిత్య శాఖలను సృష్టించినవారు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు. వీరు గద్యకవిబ్రహ్మయని బిరుదునందినవారు.

ఆధునికకాలములో భాషావిషయికమైన పరిశోధనలు చేసినవారు కోరాడ రామకృష్ణయ్య, గంటి సోమయాజులు గార్లు. నేలటూరు వెంకటరమణయ్యగారి విమర్శకపరిశోధనలు

పేరుపొందినవి. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వ తత్వవిచారము ఉత్తమవిమర్శన గ్రంథము. వ్యాసములెందఱో వ్రాసిరి. పానుగంటివారి సాక్షివ్యాసములు పేరుపొందినవి. స్వీయచరిత్రలును బయలుదేరినవి. జీవితచరిత్రలును, కథానికలును మున్నగునవి పాశ్చాత్య హిందీవంగభాషానువాదములు. నవలాసాహిత్యమునకిప్పుడు అంతుకనబడుటలేదు. చారిత్రకములు, అపరాధపరిశోధకములు ఎన్నో. భావవిప్లవముతోనే కాంకనాటికలు, నాటకములువెలసినవి. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము ప్రసిద్ధికెక్కినది. గేయసాహిత్యము సామాన్యమైనది.

దేవునానమున్న దేశానికొకకవి
యిప్పుడూరనూర నింటనింట
నేవురాకురేకు రెనమంద్రు తొమ్మండ్రు
పదుగురేసి కవులు పద్మనాభ

అన్నాడొక కవి. నిజమే, కవులెక్కువయగుటయు మంచిదేకదా! స్వేచ్ఛాప్రియులైన కవులు నియమదాస్యముపై తిరుగుబాటుచేసిరి. సంప్రదాయవిరుద్ధములైన యుపమానములనుగూడ గ్రహించిరి. పచ్చిశృంగారమును పోషించిరి. ప్రకృతివర్ణనలు ముఖ్యముగనెంచిరి. కాని నీతి, స్వాతంత్ర్యము, ప్రకృత్యనుకరణము అను మూడింటికి నపోహలు కల్పింపఁబడి, దుర్నీతిని బోధించుట కావ్యమునకు వికారము. నేటిసాహిత్యము పాశ్చాత్యదేశాదర్శముల నెత్తిపై నుంచుకొని పునసాగరికతను

కాలదన్నినది. నియమరహితమైన దాధునికసాహిత్యము నియమ రహితమైన తలతిక్కను పిచ్చియందుసుగదా!

అభారతీయ లక్షణములుగల సాహిత్యము భారతదేశ ములో విరివియైనది. ఏగ్రాథము చూచినను విషాదప్రపూరితములే. దొంగతనములే. అపరాధపరిశోధకములే. మోహశృంగారము పాటలలో, పద్యములలో నవలలో వెల్లివిరియుచున్నవి. ఇవియు వావస్థలో మాత్రము తాత్కాలికానందదాయకములేకాని బదవకానేరవు, కావున విశ్వమానవభావసమన్వయ మవసరమని నేటికవులు గుర్తించి మంగళకరమైన సాహిత్యమును దీర్చి దిద్దుట అత్యావశ్యకము. నేటి సాహిత్యము వ్యవహారిక భాషా ప్రవాహములోని సరణిననుగమించుట లెస్సయేకాని కట్టుబాటు లేక యిచ్చకువచ్చినట్లు వాడుట మంచిదా? వ్యావహారిక పదములుగాని గ్రాంధికములుగాని తమంతట కావ్యములో దొరలునేకాని పట్టుబట్టి గ్రామ్యమునే వాడవలయుననుట యుక్తముకాదు. కాబట్టి ఆధునిక సాహిత్యము భారతీయ లక్షణములతో వెలయించిన బాగుటనుండునేమో?

# విద్యార్థులు - సమ్మెలు

న్యాయసమ్మతమైన కోరికలను నెరవేర్చుకొనుటకుగాని, యజమానులకును నుద్యోగులకును మధ్య నేర్పడిన వివాదములను బహిష్కరించుకొనుటకుగాని, కార్మికులు వారి సమస్యలను బరిష్కరించుకొనుటకుగాని యుద్యోగులును గార్మికులును దమ విధులకు హాజరుకాకుండ తమ నిరసనము దెలియజేయుటకు బ్రయోగించు సాధనము సమ్మె యనబడును. ఉద్యోగులచేగాని, కార్మికులచేగాని ప్రభుత్వమువారుగాని ప్రయివేటు యజమానులుగాని, మితిమీరి పనులుచేయించుకొని తగిన ప్రతిఫలమీయకుందురు. వేతనములు పెంచుడని వారు మొరపెట్టినను బెడచెవిబెట్టుదురు. పనివాండ్రంత పనులకుబోక సమ్మె చేయుదురు. పరిశ్రమాభివృద్ధితో బాటు కార్మికుల సమ్మెలుగూడనెక్కువగుచు వచ్చినవి. సమ్మెచేయుట వారి హక్కయినది. సమ్మెలుచేయుట వలననే కార్మికులకు దగు సౌకర్యములు కల్పింపబడుచున్నవి. గాంధీమహాత్ముడుకూడ కార్మికుల యీ హక్కును సమర్థించెను. కాని సమ్మెచేయుటకు దగిన కారణము లుండవలయును. దురాశాపీడితులైన నాయకులు ముందు వెనుక లాలోచింపక సమ్మెలు చేయించుచున్నారు. ఇందువలన వస్తూత్పత్తిత దేశశ్రేయస్సుకు భంగము కలుగించును. సమ్మెలు, ఉత్తములగు నాయకుల నాయకత్వమున చేయుట మంచిది.

పాఠశాలలలో విద్యనభ్యసించు విద్యార్థులుసమ్మెచేయుట తగునా? విద్యార్థుల సమ్మెలు గాంధీయుగము ప్రారంభమైనవి. స్వాతంత్ర్యపోరాట సమయమున సహాయనిరాకరణోద్యమము ప్రారంభమైనది. అప్పుడే దేశములో సమ్మెచేయుట మొదలిడిరి. ప్రభుత్వోద్యోగులు ఉద్యోగములు చేయక సమ్మెచేసిరి. విద్యార్థులప్పుడు రాజకీయాలలో పాల్గొనవలసి వచ్చెను. వారు పాఠశాలలను బహిష్కరించిరి.

ప్రజాస్వామ ప్రభుత్వమునగూడ సమ్మెలుచేయు నలవాటు విద్యార్థులలో పోలేదు. ఉద్యోగులలోను, గార్మికుల లోను బోలేదు. ప్రత్యేకాంధ్రరాష్ట్ర ముకొరకు బోరాడు నపుడు, విశాఖ ఉక్కుకర్మాగారవిషయమునను, హిందీ యుద్యమమునందును విద్యార్థులు సమ్మెచేసిరి.అవసరమగు సమయముల విద్యార్థులు సమ్మెచేయవచ్చును. కాని అనవసరముగ చీటికి మాటికి సమ్మెచేయుటవలన గలుగు నష్టములను విద్యార్థులు గుర్తింపవలసియున్నది.

పాఠశాలకు హాజరుకాకపోవుటచేత బాఠ్యాంశములు పూర్తికావు. క్రమశిక్షణ నశించుటచే వినయ విధేయత లడుగంటును. విద్యయందాసక్తి తగ్గును. ఒక్కొకపుడు రాజకీయ పార్టీల ప్రాబల్యమున విద్యార్థులు సమ్మెచేయుటచే ప్రశాంతముగ జేయుటమాని హింసాకాండకుదిగుదురు. పాఠశాలలఆస్తిని నాశనము చేయుదురు. పాఠశాలలను దగులబెట్టుదురు. అది యంతయు మనయాస్తి అనుభావము నశించిపోవును. అంతే

కాదు ప్రభుత్వఆస్తికిగూడ నష్టము గలిగించుట శోచనీయము. ప్రభుత్వము పౌరులదేకదా! విద్యార్థులు భావిపౌరులుగదా!

పాఠ్యపుస్తకములలోని యంశములను తగ్గింపవలయును. పరీక్షలు వాయిదా వేయవలయును. పాఠ్యపుస్తకములను సకాలములో నందరకు నుచితమైన వెలకు నందుబాటులో నుండునట్లు చేయవలయును. అది యిది యననేల? ప్రతి విషయమునకుడు సమ్మెచేయుట విద్యార్థుల కలవాటైనది. విద్యార్థినాయకుడు సమ్మెలను నిర్వహించుచుందురు. ఈ సమ్మెలు సామాన్యమైనవి. పాఠశాలకు సెలవీయకపోయినను సమ్మెలు.

దేశములో నేమూల నేమిజరిగినను విద్యార్థులు సమ్మెచేయుచున్నారు. నిష్కారణముగ సమ్మెచేయుచు విద్యార్థులమూల్యమైన కాలమును వ్యర్థము చేసికొనుట మంచిదికాదు. దేశద్రోహుల మాయమాటలకు జిక్కిచెడిపోరాదు.

విద్యార్థులు తమ నాయకుని పిలుపుననుసరించి సమ్మెచేయుదురు. అతడు విరమించుమనిన విరమింతురు. అనగా ఒక నాయకుని అదుపాజ్ఞలలో మెలగుచుందురుగాన వారిలో ఐకమత్యము కలుగును. భావిజీవితములో సమ్మెలుచేయవలసి వచ్చినపుడు అందలి కష్టసుఖములను, అందుకు గావలసిన ధైర్యమును, శక్తిసామర్థ్యములను విద్యార్థిదశలోనే చవిచూచుటవలన వారు వారి కోరికలను విజయవంతముగ సాధించుకొనగలుగుదురు.

సమ్మెలుచేయుట అంతమంచిదికాదని చెప్పవలయును. న్యాయసమ్మతమైన కోరికలను దీర్చుకొనుటకు అధికారులతో సంభాషణలు జరుపవచ్చును. సమ్మెలు వర్గకలహములను బురి కొల్పును. దేశశ్రేయస్సుకు భంగకరము. సమ్మెచేయువారు హింసాత్మక చర్యలకు బూనుకొనుటచే ప్రజల సానుభూతి సహ కారములను గోల్పోవుచున్నారు. సంభాషణలు విఫలములై సమ్మెచేయుట తప్పనిసరియైనపుడు అహింసా సిద్ధాంతములను మనసులో నుంచుకొని, యుద్రేకపూరితులై హింసాచర్యలకు దిగకుండ శాంతముగ సమ్మెచేయుట మంచిది. విద్యార్థులు విద్య నేర్చుకొనుటయే విధిగ భావించి బాధ్యతలను గుర్తింపక హక్కులనే దృష్టియందుంచుకొని సమ్మెలుచేసిన నష్టమేకాని లాభములేదు. కేవలము పరీక్షల్లో నుత్తీర్ణులగుటయే ముఖ్యమని యకార్యములకు బూనుకొనరాదు. సమ్మె చేయుటయందును క్రమశిక్షణపాటించవలయును. సంఘవిద్రోహశక్తుల మాయ లకు జిక్కి వారి యండదండలు నమ్మి విద్యార్థులు సమ్మె చేయరాదు.

# వికలాంగులు

వికలమైన అంగములుకలవారు వికలాంగులు. అంగము లనగా అవయవములు. అవయములు ఉండవలసిన రూపములో నుండకపోవుట వికలమగుట యందురు. శరీరములో కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అనునీయైదును జ్ఞానేంద్రియ ములు. కాలుసేతులు క ంద్రియములు. జ్ఞానేంద్రియముల వలన జ్ఞానముకలుగ కాలుసేతులు పనులుచేయునుగదా! ఏ యవయవమైనను నుండవలసినరూపములో నుండనిచో నా యవ యవమువలన జరుగవలసినపని సక్రమముగ జరుగదు. కాలులేని వారుకొందరు, రెండుకాళ్ళులేనివారు మరికొందరు, చేయిలేని వారుకొందరు, రెండుచేతులులేనివారు కొందరు, కొందరు మూగవారు, ఇంకకొందరు గ్రుడ్డివారు, మరికొందరు చెవిటి వారు ఉండుట మనము చూచుచునేయున్నాము. కొంతమందికి ఒకఅవయములోపించిన మరికొందరకు ఒకటికంటె నెక్కువ అవయవములు లేకుండుటయుకలదు.

మానవులకి అంగవైకల ము కలుగుటకు గారణములేమై యుండును? అట్లుండుట వారి శాపమా లేకవారుచేసికొనిన పాపమా? అంగవైకల్యతకు కారణము శాపముకాదు. పుట్టుక తోనే అంగవైకల్యముగలవారు, ప్రమాదములవలన నంగవైక ల ముపొందినవారు, వంశానుక్రమముగను, దల్లిదండ్రుల అనా ర గ్యముకారణముగను నంగవైకల్యము పొందినవారు అను నాలుగురకముల వికలాంగులుకలరని పె లుచెప్పుచున్నారు.

పుట్టుకతోనే వికలాంగులగుటకు దల్లిదండ్రులే కారణ మందురు. ఆరోగ్యవంతులైన తల్లిదండ్రులకును వికలాంగులు జన్మించుటకలదు. అన్ని అవయవములు క్రమముగనుండి పాద ములు వంకరలుతిరిగి పుట్టినవారు లేరా? ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డికాదా? ప్రమాదములవలన గలుగు నంగవైకల్యతకు గారణములనేకములు. బస్సు, రైలు మున్నగు ప్రయాణములలో ప్రమాదములు సంభవించి కాలో చేయో విఱుగవచ్చును. యంత్రాగారములలో బనిచేయునపుడు కార్మికులు ప్రమాదము లకు గురికావచ్చును. పక్షవాతము, క్షయ, కేన్సరు మున్నగు వ్యాధులవలనగూడ నంగవైకల్యత కలుగవచ్చునని వైద్యులను చున్నారు. అవయముల శ్వాశతఅశక్తత కలుగవచ్చును. త్రాగు నీటిలో క్లోరిన్ అధికముగనుండుటయు, పోలియో మొదలగు వ్యాధులు వచ్చుటయు వికలాంగులగుటకు గారణములుగ జెప్ప బడుచున్నవి.

వికలాంగులు సౌదరమానవులుగారా? వారిబాగోగులను గమనించవలదా? వారు కష్టపడిపనిచేయుటకనర్హులు. వారి నాదుకొనుట ప్రజలవిధి, ప్రభుత్వమువిధి. వికలాంగులను బాగు చేయు మార్గమేలేదా? వారి శారీరక దౌర్బలము, మానసిక దౌర్బల్యమునకు గారణమై మేమీలోకముల నెందుకుబనికి రామని నిరాశతో నిస్పృహతోనుందురు. అట్టివికలాంగులకు వారి శారీరక మానసిక దౌర్బల్యమును బోగొట్టుటకు బూను కొని స్వతంత్రులుగా నిలబెట్టుటకు ప్రభుత్వము కృషిచేయ వలయును.

తొలుత సంగవైకల్యమును నిరోధించుటకు శిశుసంక్షేమ పథకముల నమలుపఱచవలయును. పోలియో మున్నగు వ్యాధులురాకుండ శిశువులకు ముందుజాగ్రత్తగా పోలియో వైద్యము చేయించవలయును. పోలియోరాకుండ సూదిమందు గాని, మందుగాని వాడవలయును. క్షయవ్యాధి నిర్మూలనకును, కేన్సరువ్యాధి నిర్మూలనకును దగుజాగ్రత్తలు తీకొనవల యును. చికిత్సకంటె ఆపుదలమేలుకదా!. ప్రమాదములవలన వికలాంగులయినవారికి తగుశస్త్రచికిత్సలు చేయించవలయును. యంత్రాగారములలో పనిచేయువారికి దగురక్షణపరికరములను సరఫరాచేయవలయును. పోలియోవ్యాధివలన నంగవైకల్యము కలిగిన శస్త్రచికిత్స చేయవలయును. అనంతరము కృత్రిమ అవయవములనమర్చి నడచుటకు తర్ఫీదునిచ్చి వారిని మామూలు మానవులుగా దీర్చిదిద్దవలయును. అప్పుడు వారి అవయవశాశ్వత అశక్తత తొలగిపోవును. కృత్రిమఅవయవములు కాన్పూరులో దయారుచేయబడుచున్నవి.

అంగవికలులకు ప్రభుత్వముచేయవలసిన సహాయమెంతేని కలదు. ప్రయివేటు సంస్థలును సహాయముచేయవలసియున్నది. వారికి ఉచిత రవాణాసౌకర్యములు కల్పించబడవలయును. ఉద్యోగవసతికూడ నేర్పాటుచేయవలయును. వారు చేయదగిన వృత్తులలో వారికి శిక్షణనీయవలయును. కుట్టుపని, ఎంబ్రాయి డరీ, పాడిపరిశ్రమ, కోళ్ళపెంపకము మొదలగుపనులలో శిక్షణ నీయవచ్చును. అంగవైకల్యమునుబట్టి వారెవృత్తులలో పనిచేయ గలరో నిర్ణయించవలెను. సంగీతము పాడగలవారికి సంగీతము చెప్పించవలెను. చిత్రలేఖనము కొంతమందికి చెప్పవచ్చును.

స్వయంఉపాధిపథకము వికలాంగులకును సమలుపరచ వలెను. ప్రతిజిల్లాలోను శిక్షణాకేంద్రములను స్థాపించవలెను. తొలుత వారికి నైతికశిక్షణనిచ్చినపిదప ఋణములీయప్రారంభించవలెను. బ్యాంకులిప్పుడిట్లే వికలాంగులకు ఋణసౌకర్యములు కల్పించుచున్నవి. తొలుత వారు రీజనల్ మేనేజర్ గారికి దరఖాస్తుపెట్టుకొనిన తరువాత బాంకులు ఋణములను నిర్ణయించి మంజూరుచేయుదురు. శరశ్రమ తక్కువగానుండు పనులలో వారికి శిక్షణయిచ్చి స్వయంఉపాధిపథకముక్రింద తక్కువవకి అప్పులీయబడును. ఒకవేళ వరదలు, గాలివానలు మున్నగువానివలన నష్టమువచ్చినచో వారికి మరల ఫైనాన్సు చేయబడును.

అంధులకుగూడ ప్రభుత్వము సహాయము చేయుచున్నది. పాఠశాలలు పించి చదువు చెప్పించి యుద్యోగములిచ్చుచున్నది. అంధత్వమునకుగారణము, విటమిన్ ఏ-లోపమందురు. సరియైన పోషకాహారమున్న అంధత్వము రాదనియందురు. కంటిజబ్బులవలన దృష్టిలోపముగలిగిన వైద్యులచే చికిత్స పొందవలయును.

వికలాంగులుకూడ మానవులేయని యెంచి వారియున్నతికి పాటుబడుట సోదరమానవుల కర్తవ్యము. ప్రపంచములో నేడు పరిష్కరింప సాధ్యముకాని వాతావరణ కాలుష్యమువలన బుట్టుకతోనే యవయవలోపమునకు గారణమగునని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ప్రభుత్వము నేడన్నివిధముల వికలాంగులకు తగుసహాయము గల్పించుచు వారియభ్యున్నతికి బాటుపడుచున్నది.

# సాంకేతిక విద్య

విద్య వివేకము నిచ్చును. వివేకమువలన బు వికసించును. ప్రస్తుత కాలములోనేగాదు, ఏ కాలములోనైనను విద్య నేర్చుకొను మానవుడు కేవలము విజ్ఞానముకొఱకే గాదు, జీవయాత్రను సాగించుటకు నాధారముగ నుండునను నుద్దేశముతో గూడ విద్య నేర్చుకొనును. ప్రభుత్వోద్యోగముచేయు న లాషతో నేడు మానవుఁడు విద్య నేర్చుకొనుచున్నాడు. చదువు వారి కందఱకు నుద్యోగములు చాలినన్ని లేవు. ఆంగ్లప్రభుత్వ కాలములో వృత్తి విద్యలు మూలబడినవి. ఉద్యోగములులేక వృత్తిపనులు చేసికొనలేక పొట్టగడపుకొను టెట్లు? కాబట్టి విద్య జీవనాధారముగ నుండవలయును. అందుచేత విద్యకు దోడు వృత్తి విద్యలు గూడ ముఖ్యావశ్యకములు. అట్టి వృత్తి విద్యనే సాంకేతిక విద్య యందురు.

విజ్ఞానము నిచ్చు విద్యతోబాటు బ్రతుకుదెరువును జూపించు విద్య నేర్చుట నేడెంతయు నవసరము. చదువు నేర్చిన వారి సంఖ్య యుద్యోగముల సంఖ్యకంటె అధికము. కాన విద్యావంతుల కందఱకును జాలినన్ని యుద్యోగములు లేవు. వారు ఇతర వృత్తు లవలంబింప నశక్తులు. కావున రెంటికి జెడ్డ రేవడలయిన విద్యావంతులు వృత్తి విద్యలు నేర్చిన స్వతంత్ర

ముగ జీవింపగలుగుదురు గదా!. మొట్ట మొదట గాంధీ మహా త్ముడీ విషయమును గ్రహించి వార్ధాలో వృత్తి విద్యా విధాన మును ప్రవేశపెట్టెను. దీనికి వార్ధా విద్యా విధానము లేక సాంకేతిక విద్యా విధానము అని పేరు కలిగెను.

ఉద్యోగములు దొరుకుటయే కష్టము. దొరకినను తగిన వేతనముండదు. ఇంజనీయరింగ్, వైద్యము మున్నగు విద్యలు నేర్చుట అధిక వ్యయప్రయాసలతో గూడినపని, అయినను నిప్పుడింజనీయర్లు, డాక్టర్లు గూడ ఎక్కువైనారు. ఆయా కళా శాలలలో ప్రవేశము లభించుటయు కష్టమే. రోడ్డు రవాణా బస్సులలోను, రైల్వేశాఖలోను, తంతితపాలా శాఖలోను మున్నగు వివిధ శాఖలలోని యుద్యోగములు నందఱకు లభించుటెట్లు?.

అందుచేత ప్రభుత్వమీ విషయమును గుర్తించి సాంకేతిక విద్యాశాఖను నిర్మించినది. పంచవర్ష ప్రణాళికలలో ధనమును కేటాయించినది, విదేశములనుండి సాంకేతిక నిపుణులను రావించినది. వృత్తి విద్యా కళాశాలలను స్థాపించినది. మన దేశములో సదుపాయములేని వృత్తి విద్యలను నేర్చుకొనుటకు కొంతమందిని విదేశములకు పంపుచున్నది. వడ్రంగిమో? నవారు నేతయో, యేదియో యొకపనిని నేర్చుటకు ఉన్నత పాఠ శాలలలో నవకాశము కల్పించినది. కాని విద్యార్థు లందఱకు నొకే వృత్తిపని నేర్చుకొనుట కభిలషింపరుగదా! అందుచేత ప్రత్యేకముగ సాంకేతిక విద్యాలయములను స్థాపించుట

ముఖ్యావసరము. అట్లయిన వారి కిష్టమైన విద్యయందు వారు నిపుణు లగుదురు.

సాంకేతిక విద్యాలయములు తగినన్ని స్థాపించుట కవకాశము లేనప్పుడు ఉన్నత పాఠశాలలో ఉన్నత విద్యతోబాటు వృత్తి విద్య నేర్చుకొనుట కవకాశము గల్పింపవలయును. ఉన్నత పాఠశాలలలో గొన్నింట క్రాఫ్ట్‌కు కాల నిర్ణయ పట్టికలో స్థానమియబడి యేదియో యొక వృత్తి విద్య చెప బడుచున్నది కాని యంతమాత్రము చాలదు. విద్యార్థులు విద ముగించునప్పటికి సాంకేతిక నిపుణులు గావలయును. వృత్తి పనియందు నైపుణ్యము గలుగునట్లు విద్యార్థుల యభిరుచినిబట్టి సాంకేతిక విద్యను బోధించు నేర్పాట్లు గావింపబడవలెను. ప్రభుత్వేతర సాంకేతిక పాఠశాలలకు ప్రభుత్వము ధనసహాయము చేయవలయును. విద్యార్థులు కళాశాల విద్యల కెగబడక వృత్తి విద్యల నభ్యసించుటకు సాంకేతిక విద్యాలయములలో జేరవలసి యున్నది.

సాంకేతిక విద్యాలయములలో జదువు విద్యార్థులు వారి కిష్టమగు విద్యను నేర్చుకొను నవకాశము గలదు. ఆ వృత్తి విద్యకు సంబంధించిన శాస్త్రాంశములు విపులముగ దెలియజేయ బడును. నూతన పద్ధతుల ననుసరించి చిన్న చిన్న యంత్రము లనుగూడ నుపయోగించుట విద్యార్థి తెలిసికొనును. స్వయ ముగా వస్తువులను దయారుచేయగల నేర్పుగల వాడగును.

సాంకేతిక నిపుణుల సహాయమున వృత్తులయందు

ప్రవీణులైనంత ప్రభుత్వోద్యోగముల కెగబడవలసిన పనిలేదు. వడ్రంగము చేయవచ్చును. నవారు నేయవచ్చును. చేనేత వస్త్రములు తయారు చేయవచ్చును. సబ్బులు చేయవచ్చును. చేసిన వస్తువుల నమ్ముకొని దిగులు లేకుండ జీవయాత్రసాగింప వచ్చును. అదియునుగాక ఇది స్వేచ్ఛావృత్తి యగుటచే నొకనికి లొంగి యుండనవసరములేదు. ఒకవేళ ఉద్యోగములు దొరకినను వృత్తి విద్యల నుపవృత్తులుగా గ్రహించి యార్థికముగా పెంపొంద వీలగును. విద్యావంతులైన వ్యవసాయదారులును, విద్యా విహీనులైన వ్యవసాయదారులును, వ్యవసాయ కూలీలును, పాక్షిక నిరుద్యోగులు. గావున వృత్తి పనులుచేసి కాలమును సద్వినియోగము చేసికొని ధనము సంపాదించుకొన వచ్చును. పెద్ద పరిశ్రమలు స్థాపించలేనివారు వృత్తి విద్యలను నేర్చి పనులు చేయవచ్చును. ప్రభుత్వము వృత్తి విద్యలను ప్రోత్సహించుటకు స్వయం ఉపాధి పథకముల మూలమున ఋణము లిచ్చుచున్నది. ఆధునిక పద్ధతుల కనుగుణముగా విద్యుచ్ఛక్తి సహాయమున చిన్న చిన్న యంత్రములుగూడ నడుపుటకు దగిన సౌకర్యము కలిగించుచున్నది. కాబట్టి సాంకేతిక విద్య యింకను పెంపొందిన దేశములో నిరుద్యోగ సమస్య పరిష్కారమగుటయేకాక ఆర్థికాభివృద్ధియై సర్వతోముఖాభివృద్ధి నందగలదు.

# గ్రహాంతరయానము

అది యోగాభ్యాసకాలము. నాటి మానవుఁడాత్మ నిగ్రహశక్తియు, నింద్రియ నిగ్రహశక్తియు గలిగి యోగశక్తిని సంపాదించెను. ఆ శక్తివలన దూరశ్రవణము, దూరగమనము, దూరదృష్టి మున్నగు శక్తులు గలిగియుండెను. అందఱకును నట్టి శక్తులుండెనా? లేదు. యోగశక్తి గలవారికి మాత్రమే కలదు. ముల్లోకములను సంచరింప శక్తిగల నారదాది మహర్షులుండిరని పురాణములు చెప్పుచున్నవి. నేడు యోగశక్తిలేని మానవుఁడు యంత్ర శక్తివలన గ్రహాంతరములకు బోగలుగుచున్నాడు. అందఱును బోఁగలరా? పూర్వమునుండియు భూమికి నితర గ్రహములకును సంబంధ బాంధవ్యములున్నవని పురాణములు చెప్పు వింతలు నేడు విజ్ఞానవేత్తలు నిరూపించుచున్నారు.

అంగారక శుక్రగ్రహములు భూచక్రమునకు దగఱగా గలవు. ఈ గ్రహములమీఁదకి పరిశోధకోపగ్రహములు ప్రయోగింపబడినవి, కాని అచ్చటికి బోయి తిరిగిరాగలమను విశ్వాసము శాస్త్రజ్ఞులకు గలుగలేదు. చంద్రగ్రహమును బరిశీలింప నిశ్చయించుకొనిరి.

1957 వ సంవత్సరములో గ్రహాంతరయానము ప్రారంభమైనది. అ తకుముందువలె జీవులను రోదసిలోనికి పంపసాగిరి. రష్యా, అమెరికాలు గ్రహాంతరయాన ప్రయోగములు చేయ

సాగిరి. ఈ యాత్రలు నేడు సాధ్యమగుటకు కృషిచేసిన ప్రవీణు లగు మార్గదర్శకులున్నారు.

భూమికి ఆకర్షణశక్తి కలదు కదా! ఆకర్షణశక్తి పరిధి దాటినగాని అంతరిక్షయానము సాధ్యముకాదు. ఎంతవేగముతో పోయిన ఆకర్షణ శక్తినుండి తప్పుకొని పోగలఁడు అనునది శాస్త్రజ్ఞుల నెదుర్కొను సమస్య. ఆ సమస నుపరిష్కరించునవి రాకెట్లు అని తొలుత రష్యా కనుగొనినది. తరువాత కృత్రిమ ఉపగ్రహములను రాకెట్లద్వారా అమెరికా రషా దేశములు ప్రయోగించెను. 1957 వ సంవత్సరము అక్టోబరు నెల 4 వ తేదీన 1 వ స్పుత్నిక్‌ను బ్రయోగించెను. స్పుత్నిక్కు అనగా ఉపగ్రహము. ఇవి వాయుమండలము నతిక్రమించి స్వేచ్ఛగ సంచారము చేయగలుగుచున్నవి. 19 8 వ సంవత్సరము అమెరికా ప్రయోగించినది.

తరువాత ఆ రెండు దేశములును అంతరిక్ష పరిస్థితుల నధ్యయనము చేసికొని ప్రాణుల సమూహముపై నా ప్రభావ మెట్లుండునో కనుగొనుటకు అనేక ఉపగ్రహములను బ్రయోగించినవి. 'యూరీగగారిన్' అను రష్యా దేశస్థుఁడు భూమిచుట్టు తిరిగి వచ్చెను.

ఈ యాత్రలు మానవునిపై నెట్టి ప్రభావము చూపునో ఆ రెండు దేశములును బరిశీలించినవి. వ్యోమ నౌకలను నడుపులోబెట్టి భూమిపై నుష్ట ప్రదేశమున దింప వీలగునా

యనియు పరిశీలింపఁబడెను. ఫలితము తృప్తికరముగ నుండెను. అనంతరము నౌకా చోదన నిర్వహణ కౌశలమును బెంపు జేసిరి.

1964 వ సంవత్సరములో జరిగిన అంతరిక్ష యాత్రలో ముగ్గురు పాల్గొనిరి. తరువాత యాత్రలో 'అలె లియోనోవ్' అనునతఁడు రోదసిలో కొలదిసేపు స్వేచ్ఛగా నుండగలిగెను. చంద్రగ్రహ ఉపరితలమును బరిశీలించి ఛాయా చిత్రముల సేకరించి భూమికి రాకెట్లు ప్రసారము చేసినవి. ఉపరితలముపై నిసుకతిప్పలు, అగాధములు కలవని ఆ ఛాయా చిత్రముల వలన శాస్త్రజ్ఞులు గ్రహించిరి. తరువాత చంద్రమండలము వెనుక భాగమును గూడ సందర్శించిరి.

1969 వ సంవత్సరము జూలై 19 వ తేదీన ఆమ్‌స్ట్రాంగ్ అనునతఁడు మొట్టమొదట చంద్రోపరితలముపై కాలుపెట్టెను. అతఁడటు నిటు తిరిగి చంద్రశిలలు కొన్నింటిని సేకరించి తిరిగి నౌకలో ప్రవేశించి తన సహచరు లిరువురతో గలసి భూమికి వచ్చెను. గ్రహాంతరయానములుచేసి యందలి విశేషములను గనుగొనవలెనని మానవుని సంకల్పము. ఆమ్‌స్ట్రాంగ్ తెచ్చిన చంద్రశిలలను శాస్త్రవేత్త లనేకులు ప్రయోగశాలలలో పరీక్షించుచున్నారు. చంద్రగ్రహమును జేరకముందే శుక్రకుజ గ్రహయానము జరిగెను. గ్రహాంతర యాత్రలలో యాత్రా కాలమును బెంచుట, రోదసిలో రెండు నౌకా విభాగములు గాని, నౌకలుగాని కూడుటకు గల్పించుకొనిన సాంకేతిక ...లము నేర్పరచుట అను రెండు లక్ష్యములను రష్యా అమెరి

కాలు సాధించెను. చంద్రలోక యాత్రవలన ననేక నూతనాంశ
ములు ప్రపంచమునకు వెల్లడియైనవి. కాని మానవునకంత
యుపకారిగా నున్నట్లు కన్పించుటలేదు.

భూమి కాకర్షణశక్తి గలదు. వస్తువుల బరువాకర్షణశక్తి
మూలముననే కలుగుచున్నది. భూమ్యాకర్షణశక్తి భూగోళ
మును జుట్టుకొని కొన్ని మైళ్ళదూరము వరకే యుండును. ఆ
భూమ్యాకర్షణ పరిధిని దాటిన తరువాత నిరాకర్షణ మండల
ముండును. అందుచేతనే అంతరిక్షమున నుపగ్రహములు దిరు
గాడుచున్నవి. భూమ్యాకర్షణ శక్తిలో చంద్రగోళమునకుగల
ఆకర్షణశక్తి ఆరవవంతు మాత్రమేయని తేలినది. అందుచేతనే
అచ్చట వస్తువులు భారమును బోగొట్టుకొనును.

చంద్రమండల విజయానంతరము కుజగ్రహయానము
ప్రారంభమైనది. మార్చి 6-అందజేసిన సమాచారమునుబట్టి
కుజగ్రహము వట్టిపోయి యెండిపోయిన నదీశయ్యలు, అగ్ని
పర్వతములు మున్నగునవి యున్నట్లు తెలియవచ్చుచున్నది.
గ్రహాంతరయాన మింకను విజయవంతమగును గాత.

# మద్యపాన నిషేధము

కల్లు, సారాయము, బ్రాంది, విస్కీ మున్నగు మత్తు గలిగించు పదార్థములను త్రాగుట మద్యపానమనబడును. ఆ మ పదా ములను త్రాగకుండ జేయుట మద పాన నిషేధము. మ ్యపానము నేడు నాగరికులకును నలవాౖటె ది.

పూర్వము మద్యపానము కలదా? కలదు. దానవ గురువైన శుక్రాచార్యునకు, కలుత్రాగనలవాటు కలదు. అయినను నాశుక్రుడే మద్యపానమును నిషేధించుచు పంచమహాపాతకములలో నుద్యపానమొకటి. మద్యము నెవరును త్రాగరాదు, అని కట్టడిచేసెను. అప్పటనుండియు మహాత్ములగు వారు మద పానమును నిషేధించుచు వచ్చిరి.

ఆంగ్లేయులు మన భారతదేశమును పాలించిన కాలములో మద్యపానములు ప్రోత్సహించిరి. విస్కీ, బ్రాంది,రమ్ మున్నగు పలురకముల మద్యములు నింగ్లాండుదేశమునుండి మనదేశమునకు గొనిరాబడినవి. ఆ మద్యము వలన వారికి గోట్లకొలది రూప్యములు ధనము లభించెడివి. జాతీయ నాయకులు మద్యపానమును నిషేధింప ననేక విధముల ప్రయత్నించిరి.

1947వ సంవత్సరములో మనదేశమునకు స్వాతంత్ర్యము వచ్చినది. స్వతంత్ర్యము వచ్చిన తరువాత వెంటనే మద్యపాన

నిషేధమమలులోనికి వచ్చినది. ఇప్పుడు కొన్ని రాష్ట్రములలో నమలులో నున్నది. కొన్ని రాష్ట్రములలో లేదు. మన ఆంధ్ర ప్రదేశ రాష్ట్రములో మద్యపాన నిషేధమమలులో లేదు.

మద్యపానమును నిషేధించుటవలన దేశమునకు గొన్ని సమస్యలెదురైనవి. కల్లుగీతపనివారు లక్షలకొలది యున్నారు. మద్యపానము నిషేధించుటవలన నాకల్లుగీతపనివారికి పని యుండదు. నిరుద్యోగ సమస్య తీరనిదై యున్న యీ కాలంలో నీ నిషేధమువలన నీ నిరుద్యోగసమస్య యింకను పెచ్చుపెరిగి పోవును. అధికాదాయమును దెచ్చిపెట్టునది మద్యము. అట్టి మద్యమును నిషేధించుటవలన వచ్చు నాదాయము తగ్గిపోయి యాకముగ ప్రభుత్వము దెబ్బతినును. కలుగునష్టమును బాపు కొనుటకు క్రొత్త పన్నులను విధింపవలయును. విధించినచో పన్నులబాధ ప్రజల కధికమగును. దేశము సర్వతోముఖాభివృ న్ధందుటకు ప్రాజెక్టులు, పరిశ్రమలు మున్నగునవి యభివృ కావలయును. ఇందులకు విశేషధన మవసరముగదా!

మద్యపాన నిషేధమువలన నెన్నియో చిక్కులున్నను ప్రభుత్వము చట్టముద్వారా శాసించినది. అయినను ప్రయోజన మేమి? ప్రజలు మద్యమును సేవించుట మానినారా? లేదు. దొంగతనముగా మద్యము తయారుచేయఁబడుచున్నది. అమ్మ బడుచున్నది. త్రాగబడుచున్నది. ప్రజల సహకారము లేనిదే చట్టము సమ వంతముగ బనిచేయలేదు. మద్యము సేవించుట

తప్పు. అను భావము ప్రజలలో గలిగినచో చట్టముతో బనిలేదు. అది పూర్వమునుండియు వచ్చుచున్న దురాచారము. మద్యమును సేవింపరాదనుచు నుపన్యాసము లీయవలయును. ఆకాశవాణి ప్రసారముల ద్వారా ప్రబోధింపవలయును. ఆశాఖలో పనిచేయు నధికారులు లంచగొండును గాకుండ వలయును. మనలో విద్యా వంతులు తక్కువ, కావున విద్యావంతులుగ జేసి తగిన విజ్ఞానమును గలిగింపవలయును. అంత వరకు ప్రభుత్వ శాసనము వలన ఫలితము లేదు.

మన ప్రభుత్వము ప్రజాస్వామ్య ప్రభుత్వము. ప్రతి పౌరునకు వాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము వున్నవి. మా యిష్టమునచ్చినట్లు మేము ప్రవర్తించెదము అనుట తగదు. హక్కులతోబాటు బాధ్యతలుకూడ కలవని తెలియవలయును. మద్యపానము వ్యక్తియొక్క స్వవిషయము. పెద్దలు విస్కీ, బ్రాందీ, రమ్ మున్నగు మద్యముల సేవించుట తప్పుగాదా? చుట్టలు, బీడీలు మున్నగు ధూమపానము లారోగ మునకు భంగకరములుగావా? కాఫీ, టీ లారోగ్యప్ర దాయ ములా? వానినేల నిషేధింపరాదు. అనువారు లేకపోలేదు. అట్టివారికి గొప్పవారు మద్యములను సేవించుట మాని మార్గదర్శకులుగ నుండి దానివలన నగు కష్టనష్టములను ప్రజలకు బోధిప వలయును.

మద పానమువలన ప్రజ లనేక కష్టనష్టముల పాలగు గున్నారు. మన దేశమున నేడు దారిద్ర్య పిశాచము తాండ

వించుచున్నది. పనిపాటలుచేసి ధనము తెచ్చికొని దానితో మద్యమును త్రావి యొడలు తెలియక పడిపోయి, ఇంటికడ భార్యాబిడ్డలకు తిండిలేక పలుమల మాడజేయు ప్రముఖులున్నారు. త్రాగి తందనాలుత్రొక్కుచు నింటికిపోయి భార్యాబిడ్డలను కొట్టు మహాత్ములున్నారు. త్రాగుటకు డబ్బులేనపుడు ఇంటిలో చెంబు తప్పేలలు కుదువబెట్టియో, అమ్ముకొనియో అవియును లేనపుడు భార్యమెడలోని మంగళసూత్రమును సహితము నమ్ముకొని మద్యమును సేవించు ఘనులున్నారు. చివరకు పశ్చాత్తాపపడి గుమిలిపోవుటయే వారి పని. ఇల్లు గుల్లగుటయే గాక వొళ్ళు ను గుల్లయై రోగములచే బాధపడుదురు.

కాబట్టి ప్రభుత్వము ఆదాయము తగ్గిపోవునని యోచక ప్రజాసహకారముతో మద్యపాన నిషేధము నమలు పరచి ప్రజాశ్రేయస్సుకు బాటుపడునని యాశించుచున్నాను. విషపూరితమైన మద్యమును సేవించి యనేకులు మృత్యువాత బడుచున్నారు. ఇట్టియెడ మద్యనిషేధ శాసనము నమలుపరచక ఉపసంహరించుకొనుట సమంజసము కాదేమో?.

# స్థానిక స్వపరిపాలనా సంస్థలు

సానికమనఁగా నొక లమునకు ంబంధించినదని అర్థము' ఏ ప్రప ములోనుండువారు అనగానే గ్రామములోనుండువారా గ్రామమును స్వయముగ పరిపాలించుకొనుట స్థానికస్వపరిపాలన యనబడును. పూర్వమునుండియు మనదేశములో స్థానికస్వపరి పాలనముగలదు. గ్రామములోని ప్రజల బాగోగులు ఆగ్రామ. లకే తెలియునుగాని ప్రభుత్వమున కంతబాగు తెలియదు. అందుచేత గ్రామపరిపాలనముకొఱకు గ్రామపంచాయితీ లేర్పాటుచేయఁబడినవి.

ప పాలనా సౌకర్యమునకు గ్రామములు కొన్నింటిని చేర్చి దానికి సమితియనియు, కొన్నిసమితులను జేర్చి జిల్లా యనియు నేర్పరచిరి. పట్టణములలో పురపాలకసంఘములు, నగరములలో కార్పొరేషనులు కలవు. ఇవియన్నియును స్థానిక స్వపరిపాలనాసం లే. ఈ పరిపాలనావ్యవస్థనే పరిపాలనావికేంద్రీ కరణ విధానము అనియందురు.

స్థానిక పరిపాలనాసంస్థలలో స్థానికులగు పౌరులే సభ్యులు పౌరులు ప్రత్యక్ష ఎన్నికలద్వారా ఆయాసం లలోని సభ్యుల నెన్నుకొందురు. రాష్ట్ర ప్రభుత్వములకు ఈ సం లను పర్యవే క్షించు నధికారముగలదు. పరిపాలన సంతృప్తికరముగలేనిచో నాసం లను రాష్ట్ర ప్రభుత్వము రద్దుచేయవచ్చును.

గ్రామపంచాయితీ పరిపాలన మనదేశములో పూర్వ కాలమునుండియుకలదు. అవి గ్రామసభలను పేర వ్యవహరింపఁ బడెను. మహమ్మదీయుల పరిపాలనాకాలములో నవియదృశ్యము లైనవి. పిదప నాంగ్లేయుల పరిపాలనాకాలములో మేయో, రిప్పన్ ప్రభువులు స్థానికసంస్థలను స్థాపించిరి. స్వతంత్రము వచ్చిన తిరువాత పంచాయితీరాజ్య మేర్పడినది.

గ్రామములను వార్డులుగా విభజింతురు. ఒక్కొక్క వార్డు కొక్కొక్కసభ్యుని ఆ గ్రామస్థులెన్నుకొందురు. ఆరు గురు మొదలు పదహారువఱకు సభ్యులుందురు. కొన్ని స్థానములు షెడ్యూలుకులములవారికిని, స్త్రీలకును కేటాయించబడును. ఎన్నుకొనఁబడిన పంచాయితీ సభ్యులు సర్పంచ్‌ని ఎన్నుకొందురు సర్పంచ్ ఎన్నికలు ప్రత్యక్ష ఎన్నికలద్వారా జరుగవచ్చును. మైనరుపంచాయితీలు, మేజరుపంచాయితీలు అని పంచాయితీలు జనసంఖ్యను, ఆదాయమును బట్టి రెండురకములు. మేజరు పంచాయితీకి ఒక ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుండును. అతడు ప్రభుత్వ ముచే నియమించబడును. పంచాయితీలు ఆయా గ్రామపరిపాలన కొనసాగించును.

సమితిసభ్యులు ఆ సమితియేరియాలోని గ్రామపంచా యితీ సర్పంచ్‌లు. వీరుగాక మరికొంతమంది సభ్యులుగూడ నుందురు. ఆ యేరియాలో ప్రతిపట్టణకమిటీ అధ్యక్షుడులేని గ్రామమునుండి జిల్లాకలెక్టరుచే నియమించబడిన సభ్యుడును, మహిళ, ముగ్గురువారు సభ్యులుగనుందురు. ఈ సభ్యులందరును

కలసి అధ్యక్షునెన్నుకొందురు. సమితీ అధ్యక్షుని ప్రత్యక్ష ఎన్నికలద్వారా ఎన్నుకొనుటయుకలదు.

జిల్లాపరిషత్సభ్యులు, పంచాయితీసమితుల అధ్యక్షులును, జిల్లానుండి యెన్నుకొనబడిన కేంద్రరాష్ట్ర శాసనసభ్యులును, జిల్లాకలెక్టరును మున్నగువారు. వీరు ఇద్దరు మహిళాప్రతినిధులను, షెడ్యూలుకలముల, తెగల ప్రతినిధులనునెన్నుకొందురు. వీరందఱును జిల్లాకలెక్టరు అధ్యక్షతను సమావేశమై పరషదధ్యక్షు నెన్నుకొందురు. అధ్యక్షునియెన్నిక ప్రత్యక్షముగగూడ జరుగ వచ్చును. పరిషత్ కార్యకలాపములన్నియు జిల్లాకలెకరు పర్యవేక్షణలో జరుగును. జిల్లాసెక్రటరీ, ఇతర జిల్లాల కారులు సహాయముచేయుదురు. సమితి కార్యకలాపముల, బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరు పర్యవేక్షించును.

పట్టణ పరిపాలనను నిర్వహించు సంస్థలు పురపాలక సంఘములు, కార్పొరేషన్లు అని అందురు. పురపాలకసంఘ సభ్యులాపట్టణ వయోజనులచే ప్రత్యక్షముగ నెన్నుకొనబడుదురు. ఒక్కొక్కవార్డు కొక్కొక్క సభ్యుడుండును. ఈ సభ్యుల స్థానములలో కొన్ని స్త్రీలకును, షెడ్యూలుకులముల, తెగల వారికిని కేటాయించబడును. సభ్యులందఱుకలసి ఛైర్మెన్నుఎన్నుకొందురు. ఈ ఎన్నిక ప్రత్యక్షముగాగూడ జరుగవచ్చును. పట్టణ సంవత్సరాదాయమునుబట్టి సెలక్షను గ్రేడు, స్పెషల్ గ్రేడు, మొదటిగ్రేడు, రెండవగ్రేడు, మూడవగ్రేడు అని పురపాలకసంఘములైదురకము. కార్పొరేషన్ కార్యకలాపములు పురపాలకసంఘ పాలనవలెనుండును.

ఈ స్థానికపరిపాలన సం లన్నియును స్థానికముగా ప్రజలకు సౌకర్యములు కలిగించుటకే యేర్పాటుచేయబడినవి. నీటివసతి కల్పించుట, విద్యా వైద్యసౌకర్యములు గలిగించుట, రోడ్లువేయుట, వంతెనలు కట్టించుట, మురుగుకాల్వలు నిర్మించుట, వీధిదీపములు వేయించుట, గ్రంథాలయములు, రేడియోలు నెలకొల్పుట మున్నగుసౌకర్యములు గలిగింపవలసియున్నది.

స్థానిక పరిపాలనాసం లకు వృత్తిపన్ను, ఇంటిపన్ను, ఆదాయపుపన్ను, నీటిపన్ను మున్నగుపన్నులవలనను, ప్రభుత్వమిచ్చు గ్రాంటు, ప్రజలును, ప్రజాసంస్థలునునిచ్చు విరాళము మున్నగువానివలనను నాదాయము వచ్చును. భూమిశిస్తు, రిజిస్ట్రేషన్ ఫీజునందువచ్చు భాగముకూడ పంచాయితీలకాదాయమగును.

సాధారణముగ పంచాయితీరాజ్ ఎన్నికలు ఐదేండ్లకొకమారు జరుగును. సభ్యులు విశ్వాసరాహిత్య తీర్మానమున అధ్యక్షుని తొలగింపవచ్చును. ప్రభుత్వమైనను పదవినుండి తొలగింపవచ్చును. పంచాయితీరాజ్ పరిపాలన ప్రజలకు శ్రేయస్కరము.